# విస్‌డమ్

అంతర్జాతీయ తెలుగు సచిత్ర మాసపత్రిక



## సంపాదకవర్గం

సంపాదకుడు:

లయన్ **కె.వి.గోవిందరావు** బి.ఏ.,ఎల్.ఎల్.బి.,

గౌరవ సహాయ సంపాదకులు:

**టి.ఎల్.ఎన్.రావు** బి.ఎస్‌సి.,

**వి.బాలకుమార్** ఎమ్.ఏ.,బి.ఎల్.,

సభ్యులు:

కె.వి.ఎస్.శరత్‌బాబు బి.ఏ.,బి.కాం.,బి.ఎల్.

కె.వి.ఎస్.విజయకుమార్ బి.కాం.,

కె.రత్నకుమారి


## చందా వివరాలు

జీవిత చందా............రూ.400/-

3 సంవత్సరాల చందా.....రూ.100/-

సంవత్సర చందా..........రూ.36/-

ఎయిర్ మెయిల్ (1 సం॥)...రూ.130/-

సీ మెయిల్ (1 సం॥)........రూ.75/-

చందా పంపవలసిన చిరునామా


**రత్నా ఏజన్సీస్**

9, దేశికారోడ్, మైలాపూర్, మద్రాస్-600004.

ఫోన్: 73327


## ఈ సంచికలో

డిసెంబరు 1990



ముఖచిత్రం:
కలర్ ట్రాన్స్‌పరెన్సీ
కె.ఆర్.వి.భక్త

**తెలుగు విస్‌డమ్ కు ఇది తొమ్మిదవ సంవత్సరం**

# ధ్యానం

## ప్రపంచాన్ని సంస్కరించాలంటే?


—జేమ్స్ ఎలెన్

కామ క్రోధాది గుణాలతో కూడిన మానవ మాత్రుడు ఇతరులను సంస్కరించి తద్వారా ప్రపంచాన్నే సంస్కరించి ఉద్ధరించాలని కుతూహలపడతాడు. నిజానికి వివేకవంతుడైన జ్ఞాని తన అంతర్యాన్ని, దాని అసలు స్వరూపాన్ని తెలుసుకోడానికి ఉద్యమిస్తాడు. ఒక ముఖ్య విషయం గ్రహించాలి. అభిలాషతో ఒకరిని సంస్కరించడానికి పూనుకునేవారు ముందుగా తమ్ము తాము సంస్కరించుకోవాలి. ఆత్మసంస్కారం పొందడానికి ఆసక్తి అభినివేశం ఉండాలి. నిన్ను నీవు సంస్కరించుకోవడం అంటే ఊరికే కోరికలను చంపుకుంటే చాలదు. ఆత్మ సంస్కారానికి ఇది ఒక మొదటి మెట్టు మాత్రమే.

నీలో ఎన్నోలోపాలు ఉన్నాయి. నీలోపాలను అన్నిటినీ సరిదిద్దుకో. అహంకారం వదలుకో.

(మిగతా 3 వ పేజీలో)

# సంపాదకుని పేజీ

## వ్యక్తిత్వంతో సహజంగా ఉండటం నేర్చుకో

ప్రపంచంలో ఇతర ప్రాణులన్నిటికంటే భిన్నమైనవాడు మానవుడు. కాబట్టి అట్టి మానవుడు తన వ్యక్తిత్వాన్ని ప్రకటించుకుంటూ సహజంగా ఉండటం అభ్యసించాలి. భగవంతుని సృష్టిలో మానవుని జన్మ అద్వితీయమైనదన్న విషయం విస్మరించకూడదు. మానవుని మనస్సు ఒక బ్రహ్మాండమైన శక్తికి నిలయం. ఉత్పాదించుకుంటున్న కొద్దీ ఈ శక్తి అనంతంగా ప్రవృద్ధి పొందుతూంటుంది. ఎటువంటి ప్రత్యేక సామర్థ్యాలు లేని సామాన్య మానవుడు కూడా మానసికంగా తనంతట తాను శక్తి సామర్థ్యాలను తర్కించుకుని అపూర్వఫలసాయాన్ని పొందగలుగుతాడు.

మానవునికి తనదే అయిన వ్యక్తిత్వం ముఖ్యం. పెద్దల జీవితాలను పరిశీలించి ప్రేరణను కలిగించుకోవడం, స్ఫూర్తిని చెందడం తప్పుకాదు. కానీ సదసద్వివేచక్షణ లేకుండా అనుకరించడం మాత్రం ప్రమాదకరం.

జ్ఞాన సంపాదనకు నిత్య చైతన్యవంతమైన సృజనాత్మక శక్తియొక్క మర్మాన్ని, రహస్యాన్ని తెలుసుకోవాలి. పట్టుదలతో విజ్ఞానాత్మకంగా ఉద్యమిస్తే ఎటువంటి అసాధ్యాలను కూడా అవలీలగా సాధించగలుగుతారు.

ప్రత్యేకమైన "నీది" అనే నీ స్వంతమైన వ్యక్తిత్వాన్ని సాధించడానికి ఆకాంక్ష, అభిలాష ఉండాలి. వ్యక్తిత్వం వల్లనే వివిధ రంగాలలో అనేకమంది వైజ్ఞానిక శాస్త్రజ్ఞులు అనేక క్రొత్త విషయాలను కనుగొన్నారు. వివిధ దేశాలలో

"ఏ పద్ధతిలో రాశావని కాదు, ఏంరాశావనేది ఇప్పుడు నిజమైన పాఠకులు ఆశించేది."

విజయం పొందినవారు తమ వ్యక్తిత్వాన్ని నిలబెట్టుకుని మార్గదర్శకులుగా ఉన్నారన్న విషయం ఎన్నటికీ కాదనలేము.



స్వకీయమైన స్వధర్మంతో, వ్యక్తిత్వంతో పథకాలు వేసుకుంటూ సాగితే ఎటువంటి వార్తైనా తమ జీవితాశయాలను విజయవంతం చేసుకోగలుగుతారు.

●

[illegible]

## చైనా ప్రపంచంలో అత్యధికంగా బట్టలు ఎగుమతిచేసే దేశం

*ప్రపంచంలో అన్ని దేశాలకంటే చైనా అత్యధికంగా బట్టలను ఎగుమతి చేస్తుంది. ఇది సాలీనా 32 బిలియనుడాలర్ల చైనా ఎగుమతులలో సగానికి సగం ఉంటుంది.*

( 2 వ పేజీ తరువాయి)

స్వప్రయోజకత్వం మానుకో. స్వార్థపరత్వం పోగొట్టుకో. దురహంకారం, స్వప్రయోజకత్వం ఉన్నంతకాలం నీ లోపాలు నీకు తెలియవు. అవి తెలుసుకున్నప్పుడే నీ ఆత్మసంస్కారోద్యమాలు పూర్తి అవుతాయి. ఆత్మవంచన లేకుండా పవిత్రతను పాటిస్తూ, విమర్శనా బుద్ధితో మంచిచెడ్డలను తెలుసుకోగల వివేకాన్ని పెంచుకో. అహంకారానికి లొంగిపోకుండా విజయంపొందితే ఆత్మప్రకాశం అఖండ జ్యోతిగా వెలుగుతుంది. మనో మందిరం నిరామయం అవుతుంది. సద్భావాలనే రెక్కలతో భువినుండి స్వర్గానికి ఎగురగలుగుతావు. చీకటి నుంచి వెలుతురులోకి ప్రవేశిస్తావు. లేకపోతే కోరికలకు బానిసవైపోయి అంధకారంలో తడుముకుంటూ ఉంటావు.

●

# అంతరాళంలో

కృత్రిమ ఉపగ్రహాల మరమ్మత్తులు, పెద్ద పెద్ద అంతరిక్ష శిబిరాలను సిద్ధ పరచడం, కక్ష్యలో అంతర్గ్రహనౌకలను సిద్ధంచేయడం, నిస్సహాయంగా నిలిచి పోయిన అంతరిక్ష నావికులను సంరక్షించడం మొదలైనవి ఇక



కొన్ని విజ్ఞానాత్మక ఊహలు గాక అంతరాళంలో సంభవించే వాస్తవాలుగా పరిణమిస్తాయి. ఆస్ట్రోనాటులు, కాస్మోనాటులు అంతరాళంలోకి సాహసించి తమ లక్ష్య సాధనకు పునాదులు వేసారు.

అంతరిక్ష మానవునికి సహకరించడం కంటే అతనిని సంరక్షించడమే ఇంజనీర్ల ముఖ్య ఉద్దేశము. అంతరాళంలో శరీరంలో రక్తనాళాల అంతర్యపీడనకు ప్రతిశక్తి లేకపోవడం వల్ల ప్రెషరైజ్డ్ సూటులేకుండా మానవుడు ఒక్కసారి విస్ఫోటనం చెంది ప్రేలిపోతాడు. ప్రత్యేకమైన సూటు అతడిని రక్షిస్తుంది. అయితే ఇది అతని గమనాన్ని, కదలికను అదుపులో పెట్టి పరిమితం చేస్తుంది. సముద్ర మట్టపు ఒత్తిడి సూటుని గట్టి బంతిగా చేస్తుంది. అంతరిక్షంలో మానవుని కాళ్ళూ చేతులు కదవ లేని శిలావిగ్రహం లాగా మార్చేస్తుంది. సూటులో ఒత్తిడిని పదిలో నాల్గవవంతు వాతావరణ (పెద్దపెద్ద ఎత్తుప్రదేశాలలో పర్వతారోహకులు ఎదుర్కొనే ఒత్తిడి) ఒత్తిడికి తగ్గించడమే దీనికి పరిహారము.

పాక్షికంగా ప్రెషరైజ్డ్ చేయబడిన సూట్లువల్ల కూడా కాళ్లు చేతులు కొంతవరకూ మాత్రమే కదిలించడానికి వీలు ఉంటుంది. చేతులు మరియు కాళ్ళు కీళ్లవద్ద వలయాలవంటి గాలితిత్తులు కొంతవరకూ సహాయపడతాయి. అయినా పెద్దపెద్ద చేతితొడుగులు (Gloves) అవసరమై ఉంటాయి. అయితే ఇవి ఆస్ట్రోనాట్ లేక కాస్మోనాట్ చేతులతో చేసే నాజూకు పనుల సామర్థ్యాన్ని తగ్గిస్తాయి.

ఇంతేగాకుండా అంతరాళంలో భూమ్యాకర్షణ లేని శూన్యంలో మానవుని నిలబెట్టడానికి ఉపాయం లేదు. అంతరాళంలో మానవుడు ఒక రెంచిని త్రిప్పడానికి ప్రయత్నిస్తే అతడి శరీరం అభిముఖంగా తిరగడానికి ప్రారంభిస్తుంది. ప్రతిక్రియకూ అభిముఖంగా సరిసమానమైన బలం ఉంటుందనే న్యూటన్ 3వ సూత్రం భూమి మీదకంటే అంతరాళంలో సుస్పష్టంగా తెలుస్తుంది.

750కి.మీ.ల ఎత్తుపైన మానవునికి సూర్య కిరణాల తాకిడి లేకుండా ఉండడానికి స్పేస్ సూట్‌కంటే దిట్టమైన సంరక్షణ ఒకటి అవసరమై ఉంటుంది. రక్షాకవచం ఉన్న కాప్స్యూలు 33,150 కి.మీ.ల ఎత్తున కృత్రిమ ఉపగ్రహపు వేగము భూభ్రమణ వేగానికి సరిసమానంగా ఉంటుంది. స్పేస్ ఇంజనీరులు ఇక్కడ శాశ్వతమైన అంతరిక్ష విడుదులు ఏర్పాటు చేయడానికి ప్రయత్నిస్తున్నారు. ఇది భూమిపైన ఒకేచోట స్థిరమైన కక్ష్యలో తిరుగుతుంటాయి.

ఇంతలో స్పేస్‌సూట్లు ధరించిన ఆస్ట్రోనాట్స్ (కాస్మోనాట్స్) అనేకమంది జెట్ ఇంజను

"పుణ్యాత్ములు స్వర్గానికి వెళ్లడానికంటే
పాపాత్ములు నరకానికి వెళ్లడానికి తీవ్రప్రయత్నాలు చేస్తారు."

ప్రొపెల్డ్ బాక్‌పాక్స్ తోను, స్పేస్ స్కూటర్లతోను అంతరాళంలోకి చొరవచేసి ప్రవేశిస్తారు. ఈసాధన సంపత్తులతో ఎగురుతూ ఆస్ట్రోనాటులు (కాస్మోనాటులు) చేసేపని మితంగా ఉంటుంది. అంతరాళంలో ఇంతవరకూ మరమ్మత్తులకు పూనుకో వలసింది ఏమీలేదు.

పగిలిపోయిన లేక సక్రమంగా తిరుగని అంతరిక్షనౌకలు భూకక్ష్యలో తిరుగుతూంటాయి. పూర్తిగా పనిచేయని అంతరిక్ష నౌకలు కూడా కొన్ని ఉంటాయి. కొన్ని భూగ్రహం నుంచి ఆదేశాలను అనుసరించ కుండా చిలుకలులాగా పంపినవార్తలే తిరిగితిరిగి పంపుతూంటాయి. ఇక నట్లు, బోల్టులు, పనికిరాని తుక్కు (junks) భూమికి దగ్గరగా అంతరాళంలో ఒకదానికి ఒకటి కొట్టుకుంటూ శబ్దం చేస్తూంటాయి.

అంతరాళంలో పెరిగిపోతూన్న తుక్కును సేకరించడానికి గార్బేజి కలక్టర్ల అవసరం ఉంటుంది. కానీ ప్రస్తుతం సక్రమంగా పనిచేయని అంతరిక్ష నౌకలకు మరమ్మత్తు దారులు ఏంచేయలేరు. అసలు అంతరిక్ష నౌకలు మరమ్మత్తు అవసరంతో తయారు కాబడలేదు. మరమ్మత్తులు ప్రారంభించినా మరమ్మత్తులు చేసే పవర్ టూల్స్ సహాయంతో కూడా నట్లును, బోల్టులను తీయలేరు. శూన్యవాతావరణం వల్ల నట్లులు బిగించుకు పోతాయి.

అంతరాళంలో, భూమిపైన శూన్య మంది రంలో ఇంటర్ఎటామిక్ బాండింగ్ కానీ కోల్డ్ వెల్డింగ్ కానీ జరగడానికి శోషణం (absorption) చాలా మెల్లిగా జరుగుతుంది. భవిష్యత్తులో పింగాణీ లేక ఉక్కువంటి ఒకదానికి ఒకటి అంటుకోకుండా ఉండే వస్తువులను ఉపయోగించి కోల్డ్‌వెల్డింగ్ చేస్తారు. పనిముట్లకు అరిగిపోని వస్తువుతో పూతపెడతారు. భవిష్యత్తులో వాటంతట అవే తిరిగే కృత్రిమ గ్రహాలకు అతిసులభంగా పిరాయించగల విడిభాగాలు ఉంటాయి.

కక్ష్యలో పనులుచేయడం జెమిని 8 తో ప్రారంభమైంది. అంతరిక్షనౌకను వదలిన ఆస్ట్రోనాట్ నౌక వెనుక దిక్కున తేలుతూ వెడుతూ ప్రత్యేకమైన స్పేస్ టూల్‌ను తీసి అది తేలిపోకుండా ఉండడానికి ముంజేతికి తగిలించుకున్నాడు. ఆ తరువాత కొన్ని బోల్టులు వదులు చేసి ప్రత్యేకంగా ఏర్పరచిన పటకారుతో తిరగవేసి తిరిగి బోల్టులు బిగించాడు.

కొద్ది సంవత్సరాలలో ఆస్ట్రోనాట్‌లు (కాస్మోనాట్‌లు) అంతరాళంలో స్క్రూలను బిగిస్తూ తీరిక లేకుండా ఉంటారు. అంతరాళంలో వస్తువులు భార రహితములైనా వాటి పరిమాణం అలాగే ఉంటుంది. అజాగ్రత్తగా ఉండే ఆస్ట్రోనాట్ రెండు భారవంతమైన వస్తువుల మధ్య భూగ్రహం మీదలాగే పూర్తిగా నలిగిపోయి బాధపడతారు.

●

## మహిమాన్వితుడవు అనిపించుకో




*విజయవంతుడవని అనిపించుకోడం కంటే మహిమాన్వితుడవు అనిపించుకో. నేడు జీవితంలో అత్యధికం సాధించగలిగేవాడు విజయశీలుడు. కానీ మహిమాన్వితుడు పొందిన దానికంటే అధికంగా ఇస్తాడు.*

"ఏకమువలనే అనేకమునకు విలువగలుగుచున్నది."

# నిజాలు - నిదర్శనాలు

## భారతదేశపు ఈశాన్య ప్రాంతాలలో ఏనుగుల ఆధిక్యత

భారతదేశంలో ఏనుగుల సంఖ్య 15,700 మరియు 17,500 మధ్యఉంది. అత్యధికంగా



7,000 మొదలు 7,400 ఏనుగులు భారతదేశపు ఈశాన్య ప్రదేశాలలో ఉన్నాయి.

* * *

## ప్రపంచంలో 16శాతం విద్యుదుత్పాదన అణుశక్తి నుండి లభిస్తూంది

ఈనాడు ప్రపంచంలో ముఖ్యంగా అణుశక్తి నుండి 16 శాతం విద్యుతుద్పాదన జరుగుతూంది. కొన్ని దేశాలలో 50 మొదలు 70 శాతం విద్యుత్తు అణుశక్తి నుండి లభిస్తూంది.

* * *

## కాన్సర్ అధికంగా ఏర్పడుతూంది

భారతదేశంలో పొగకాల్చుటవల్ల మరియు పొగాకు నమలుట వల్ల కాన్సరు రోగుల సంఖ్యా అధికస్థాయిలో ఉంది. మిలియను జనాభాకి సుమారు 1500 మంది కాన్సరు రోగులు ఉన్నారు. ప్రతీసంవత్సరం 5,00,000 మంది కాన్సరుతో మరణిస్తున్నారని లభించిన లెక్కలను బట్టి తెలుస్తూంది. 50 శాతం కాన్సరు నోటిలోను, మూత్ర ద్వారంలోను సంభవిస్తూంది.

* * *

## ఎయిర్ ఇండియా రికార్డు లాభం

ఎయిర్ ఇండియా 1989-90లో వాయు విమాన ప్రయాణ సౌకర్య చరిత్రలో రికార్డు లాభం - రూ. 112 కోట్లు సాధించింది. గతసంవత్సరం మీద ఇది 68.2 శాతం అధికం.

* * *



"అల్పవిద్యావంతునకు అహంకారం అధికం."

## ప్రపంచంలో కాఫీ ఉత్పాదనలో 2.4 శాతం భారతదేశానిది

మొత్తం ప్రపంచం మీద కాఫీపంటలో 2.4 శాతం భారతదేశం ఉత్పాదిస్తుంది. ప్రపంచపు



కాఫీ ఎగుమతులలో భారతదేశపు వాటా 2 శాతం. 1990 సం.లో దేశంలో కాఫీ వినియోగం 65,000 టన్నులు ఉంటుందని ఊహించబడుతూంది.

* * *

## జీవితప్రమాణం

భారతదేశంలో జీవితప్రమాణం మగవారికి 58.1 సంవత్సరాలు, స్త్రీలకు 59.1 సంవత్సరాలు. ఇదే స్వాతంత్ర్యం తరువాత 1951 లో వరుసగా 32.45 మరియు 31.66 సంవత్సరాలు.

* * *

## ప్రోసెస్ చేయబడ్డ ఆహారపదార్థాలు

ముఖ్యంగా అభివృద్ధి పొందిన దేశాలలోను, అభివృద్ధి పొందుతూన్న దేశాలలోను ప్రోసెస్ చేసే పరిశ్రమలు మొత్తం పండింపబడిన వళ్లు కాయగూరలలో 60 మొదలు 70 శాతం వినియోగించుకుంటున్నాయి. భారతదేశంలో ఇది కేవలం 0.5 శాతం మాత్రమే.

* * *

## 1500 మిలియనుమంది జనాభాకి 50 శాతం ఆహారం వరిబియ్యము

1500 మిలియను మందికి వగానికి సగం ఆహారం వరి అన్నం. మరో 500 మిలియను మందికి ఇది 25 మొదలు 50 శాతం అవసరం. వరి అన్నంలో 80 శాతం పిండిపదార్థాలు, 12 శాతం నీరు, 7 శాతం ప్రోటీనులు మరియు కొద్దికొద్దిగా పీచు, క్రొవ్వు, ఖనిజాలు, విటమిన B ఉన్నాయి.

* * *

## జాతీయ ఆదాయంలో తక్కువ వంతు వ్యవసాయానిది

అభివృద్ధి పొందిన దేశాలలో జాతీయ ఆదాయానికి వ్యవసాయం వల్ల లభించేది చాలా తక్కువ. బ్రిటనులో దీని భాగము 2 శాతం, యునైటెడ్‌స్టేట్స్‌లో 3 శాతం మరియు కెనడాలో 4 శాతం మాత్రమే.

## ఆఫ్రికా విదేశీ ఋణం

[illegible] 250 బిలియను డాలర్ల (2,50,000 మిలియను [illegible]) [illegible] 47 సంవత్సరాలు మాత్రమే.

— [illegible]

"ఆత్మానుభవం గలవానివద్ద వాచాలత ఉండదు."

# జపమాలలో 108 పూసలు ఎందుకు?

భగవంతుణ్ణి అష్టోత్తర శతనామావళితో ఎందుకు అర్చించాలి? జపం చేసుకునే తావళంలో 108 పూసలే ఎందుకు ఉండాలి? వీటికి వివరణ "పరమాత్మ ఈశ్వరతత్త్వం" అనే గ్రంథంలో చూపబడింది. సగుణ బ్రహ్మము ద్వాదశాదిత్యులుగా నిరూపించబడింది. వీరు కశ్యపునకు అదితియందు కలిగిన తుషితులు 12 మంది. వీరే ద్వాదశాదిత్యులు. వీరు ఇంద్రుడు, ధాత, పర్జన్యుడు, త్వష్ట, పూష, ఆర్యముడు, భగుడు, వివస్వన్తుడు, విష్ణువు, అంశుమంతుడు, వరుణుడు, మిత్రుడు. ఈ పన్నెండుగురు సంవత్సరంలో 12 మాసాలుగా నిరూపించబడ్డారు.

నిర్గుణ బ్రహ్మము 9 అనే సంఖ్యతో నిరూపించబడుతుంది. దీని గుణజముల అంకెలను కలిపినప్పుడు ఎప్పుడూ 9 ఏర్పడుతుంది.

| | | | |
|---|---|---|---|
| 9×1 | = 9 | | |
| 9×2 | = 18 (1+8 | = 9) | |
| 9×3 | = 27 (2+7 | = 9) | |
| 9×4 | = 36 (3+6 | = 9) | |
| 9×10 | = 90 (9+0 | = 9) | |
| 9×11 | = 99 (9+9 | = 18 | |
| | | = 1+8=9) | |
| 9×12 | = 108 (10+8 | = 18=1+8=9) | |

సంఖ్య 9 మార్పులేని దానిని సూచిస్తుంది. మార్పులేని సత్యం పరబ్రహ్మ - తొమ్మిది సంఖ్యచే సూచింపబడుతుంది. ప్రపంచంలో స్థిరంగా కనిపించేదంతా వ్యక్తావ్యక్తమైన బ్రహ్మతత్త్వం. 9ని 12చే గుణించగా వచ్చే లబ్ధము 108. ఈ అంకెలను కలిపితే తిరిగి 9 ఏర్పడుతుంది. సంస్కృతంలో నవ (తొమ్మిది, అంటే క్రొత్తది, స్థిరమైనది అని అర్థముంది. ప్రణవ మంత్రంలో 'ఓం'కారము నవ. శ్రీచక్రంలోని చక్రాలు - త్రైలోక్య మోహనము, సర్వాశాపరిపూరకము, సర్వ సంక్షోభణము, సర్వ సౌభాగ్యదాయకము, సర్వార్థ

## భూతలం మీద నీటి పరిమాణం 1454 మిలియను ఘన కిలోమీటర్లు



*భూతలం మీద మొత్తం నీటి పరిమాణము 1454 మిలియను ఘనకిలోమీటర్లు. ఇది మొత్తం భూమండలం మీద 2650 మీటర్ల లోతుగల నీటి తలానికి సమానం. దీంట్లో మహా సముద్రాలు 94 శాతం, భూగర్భ ప్రవాహాలు 4.1 శాతం, హిమానీ నదములు 1.65 శాతం. వీటి తరువాత చెరువులు, సరస్సులు 0.016 శాతం, భూమిలో తేమ 0.005 శాతం, వాతావరణంలో ఆవిరి 0.001 శాతం మరియు నదులు 0.0001 శాతం. మొత్తం నీటి పరిమాణంలోఒక మిలియను వంతు మాత్రమే నదీ జలపరిమాణం. ఇదే భూతలం మీద మానవ జాతి కంతకు త్రాగడానికి మంచి నీటి ఆధారం.*

-'యునెస్కో' సౌజన్యంతో

"ఈశ్వరునియందు ఉండేమాయ ఈశ్వరుని బాధింపక పోయినా ప్రపంచాన్నంతా భ్రమింపజేస్తుంది."

పాధకము, సర్వరక్షాకరము, సర్వరోగహరము, సర్వసిద్ధి ప్రదాయకము, సర్వానందదాయకము - నవ చక్రాలు. నవతత్వం, నవతాళాలు, నవదేవతా గణాలు, నవదేవతా భేదములు, నవద్రవ్యాలు, నవధాన్యాలు, నవనిధులు, నవబ్రహ్మలు, నవ భక్తులు, నవరంధ్రాలు, నవరత్నాలు, నవరసాలు, నవవర్షాలు, నవవిధ దశలు, నవ విధ భక్తి, నవవిధమంత్రాంగాలు, నవ విధ స్నాతకాలు, నవారణ్యములు, నవదుర్గలు మొదలైనవి ప్రసిద్ధములు.

భగవదర్చనకు 108 పేర్లు, భగవన్నామ జపానికి, మంత్ర జపానికి 108 పూసల తావళం లేక జపమాలను ఉపయోగించినట్లే ముఖ్యమైన ధర్మాచార్యులు, జగద్గురువులు అయిన సన్యాసు లకు పేరుకు ముందు 108 శ్రీ అని వ్రాయడం కూడా ఒక పద్ధతి ఉంది. ఈ సమస్త బ్రహ్మాండం లోను గ్రహపిండం మీద నక్షత్రపు కక్ష్య ఉంటుంది. ఈ నక్షత్రాల మీద వేరే ఏవిధమైన శక్తి ప్రభావం ఉండదు. ఒక వ్యక్తికి సర్వోచ్చమైన పరమస్థానం ఇవ్వదలచినప్పుడు ఈ నక్షత్ర కక్ష్య కంటే ఉత్తమస్థానం ఇవ్వాలి. ఈ పదవిని సాధారణంగా నిరంతరం సర్వత్ర సంచారంచేసే పరివ్రాజకు లైన ధర్మ ప్రచారం చేసే మహాత్ములకు మాత్రమే 108 శ్రీ వ్రాస్తారు. దీనికి నక్షత్ర సంఖ్య 27 (2+7) = 9. దిక్కులు 4చే 27ని గుణించినప్పుడు 27×4 = 108. ఈ 108 ని ఉపయోగించి 108శ్రీ అనివ్రాస్తారు.

కొంతమంది 1008శ్రీ, అనంతశ్రీ కూడా వ్రాస్తుంటారు. నూరుకంటే అధికం వెయ్యి. వెయ్యి కంటే అధికం లక్ష, దశలక్ష అని వ్రాస్తుంటారు. కాని శత (100) అంటే అనంత అనే అర్థం ఉండటంచేత ప్రాచీనులు 108శ్రీ వ్రాయడం ఉత్తమం అని నిర్ణయించారు.

●

## జీవితంలో నేర్వదగిన పాఠాలు




★ నవ్వడం నేర్చుకో. నవ్వు ఔషధాన్ని మించిన జీవరసాయనం.

★ నీ పనిని నీవు చేసుకోడం అభ్యాసం చేసుకో. ఇది కొందరికే సాధ్యం.

★ కథ చెప్పడం నేర్చుకో. బాగా చెప్పబడిన కథ రోగి గదిలో సూర్యకాంతి వంటిది.

★ దయాదాక్షిణ్యంతో కూడిన కబుర్లు చెప్పు. ఎవ్వరూ రోషంతో ఆగ్రహించరు.

★ అసభ్యంగా ఎత్తిపొడుపు మాటలాడకు. చెప్పే వారికి, వినేవారికి కూడా ఇవి ఎంత మాత్రం సంతృప్తిని ఇవ్వజాలవు.

★ సణగకుండా ఉండటంనేర్చుకో. ప్రపంచంలో మంచిని చూడలేకపోతే చెడును నీలో ఉంచుకో.

★ చిరుహాసంతో బాధలను, నొప్పులను కనిపించ నీయకు. ఎవ్వరూ నీ బాధలను పట్టించుకోరు.

★ నీ కష్టాలు నీవు అనుభవించడం నేర్చుకో. నీ కష్టాలు ఇంకొకరికి ఎవ్వరికీ అక్కరలేదు.

★ అన్నిటికంటే చిరుదరహాసంతో ఉండడం నేర్చుకో. ఎంతో ఉపకారం కలుగుతుంది.

-సమ్మైత్రి

"సత్సాంగత్యం ఆత్మవికాసానికి ముఖ్యాంగం."

# కూరగాయల విశిష్టత

కూరగాయల యొక్క ఔషధగుణాలు మానవులకు బలం, పుష్టి, ఆరోగ్యం కలిగిస్తాయి. ఇవి అనేక రోగాలను ఎదుర్కోడానికి సహకరిస్తాయి అంటే సందేహంలేదు. శరీరం ఆరోగ్యానికి అవసర మైన లవణాలు, ఖనిజద్రవ్యాలు, జీవశక్తిని ఇచ్చే విటమినులు మనకు వివిధ కూరగాయల రూపంలో లభిస్తున్నాయి.

నిమ్మ: శరీరం పైచర్మానికి నునుపు, మార్దవం కలిగించి ఆరోగ్యవంతంగా ఉంచడానికి నిమ్మ అమూల్యమైనది. నిమ్మరసాన్ని శరీరంపైన



పట్టించి ఆరనివ్వండి. శరీరంపైన పొడువుడు కాయలు, నల్లమచ్చలు, ఎండదెబ్బ, దురద, తామర మొదలైనవాటిని నివారిస్తుంది. శరీరంపైన, ముఖంపైన, ఏర్పడే ముడతలను పోగొడుతుంది. నిమ్మరసాన్ని ముడతలపై పట్టించి కొన్ని గంటలసేపు ఆరనివ్వాలి. ఆ తరువాత శుభ్రమైన నీటితోకడిగి ముడతలమీద ఆలివ్‌నూనెనుగానీ మంచి కొబ్బరినూనెనుగానీ పట్టించండి. తలలోలేచే తెల్లపొట్టు నివారణకు కూడా నిమ్మ చాలా యోగ్యమైనది. ఒకకప్పు వెచ్చని మంచినీటిలో అరనిమ్మపండు రసంపిండి పరగడుపున త్రాగితే జీర్ణశక్తి అభివృద్ధిపొందు తుంది. క్రొవ్వుసంబంధమైన ఆమ్లాలను చేరని వ్వదు. అందుచేత స్థూల శరీరాన్ని లేక బలువును తగ్గించుకోడానికి నిమ్మపండు ఉపయోగపడు తుంది.



తొక్కతో నోటి పళ్లను, చిగుళ్లను రుద్దితే చిగుళ్లు గట్టిపడి పళ్లవెంట రక్తస్రావాన్ని అరి కడుతుంది. పయోరియా తగ్గుతుంది. గారకట్టి పచ్చగాఉంటే దంతాలు శుభ్రపడి ముత్యాలు లాగా ఉంటాయి. నిమ్మరసం, తేనె రెండూ



[redacted]

"డంబాడంబరాలు సాగేచోట ఉన్నదంతా బూటకమే."

సమపాళ్లతో కలిపి ప్రతీరెండేసిగంటలకు తీసుకుంటే అన్నిరకాల దగ్గులు హరిస్తాయి. మొదట ఒక పెద్దచెంచాడు నిమ్మరసంత్రాగి ఆ తరువాత గోరువెచ్చని నీటిలో అర్థనిమ్మకాయ రసం కలిపినమిశ్రమంతో గంటకు ఒకసారి పుక్కిలిస్తే రెండురోజులలో గొంతునొప్పి తగ్గిపోతుంది. నిమ్మరసం, మంచి నీళ్ళు సమపాళ్ళలో చేర్చి రోజుకు 3-4 సార్లు త్రాగితే ఇన్‌ఫ్లుయెన్జా జ్వరలక్షణాలు తగ్గిపోతాయి. చిన్నచిన్న కీటకాల్ను, చీమలు కుట్టినప్పుడు కలిగే మంటకు నిమ్మరసం అమూల్యమైనది.




ఉల్లిపాయలు: సామాన్యంగా దీనిని ఆస్త్మా (దగ్గు, ఒగర్పు), రొమ్ముపడిశము, న్యూమోనియా, ఇన్‌ఫ్లుయెన్జా, జలుబులకు సిఫారసుచేస్తారు. ముక్కుదగ్గరి వల్లములలో చేరిన శ్లేష్మం వల్బబడి పైకివచ్చేస్తుంది. కాబట్టి సైనస్‌కు కూడా దీనిని వాడతారు. లో బ్లడ్‌ప్రెషర్, అనిద్ర, నడుంనొప్పి, న్యూరైటిస్, అతిస్థూల్యత, జలుబు కలవారికి ఉల్లి మేలుచేస్తుంది. శరీరంలో క్రిములను నాశనంచేస్తుంది.

టొమాటోలు: వండకుండా టొమాటోపళ్ళు తినడంవల్ల చర్మం ఆరోగ్యవంతంగా ఉంటుంది. రక్తం శుభ్రపడుతుంది. కీళ్లవాతం, కీళ్లనొప్పులు, క్షయ, అధికరక్తపు ఒత్తిడి మొదలైన వాటికి కూడా ఇది మంచిది. లివరు కంజెషనును తగ్గిస్తుంది. మూత్రపిండాలలో రాళ్లను కరిగిస్తుంది. జీర్ణకోశంలో చేరిన వాయువులను తగ్గిస్తుంది. జలుబులను పోగొడుతుంది. టొమాటోలో ఉండే నికోటినిక్ ఆమ్లం రక్తంలో కొలెస్ట్రాల్‌ను తగ్గిస్తుంది. ముఖ్యంగా దీనిలోగల విటమిను K రక్తస్రావాన్ని అరికడుతుంది.

## సుప్రసిద్ధగ్రంథాలు- వాటి రచయితలు

*టు లివ్ ఆర్ నాట్ టు లివ్: నిరాద్ సి. చౌదరి*
*స్టోరీ ఆఫ్ మై లైఫ్ : మోషే దయాన్*
*వార్ ఆఫ్ ఇండియన్ ఇండిపెండెన్స్: వీర్ సావర్కార్*
*ట్రయంఫ్:జాన్ కెన్నెత్ గాల్‌బ్రైత్*
*యశోధర: మైథిలి శరణ్‌గుప్తా*
*జుల్ఫీ, మైఫ్రెండ్: పీలూ మోడీ*

## సిగరెట్టుకే అధిక ప్రచారం

[illegible]

## డెన్మార్క్‌లో కొన్ని వాస్తవాలు

* *డెన్మార్క్‌లో మూటికి రెండువంతులు భూ ప్రదేశం వ్యవసాయానికి వినియోగపడుతూంది.*
* *ముఖ్యంగా వెన్న, చీస్ ఉత్పత్తులకు పాలు వినియోగపడతాయి. 14 శాతం పాలుమాత్రమే త్రాగడానికి ఉపయోగమవుతుంది.*
* *డెన్మార్క్ మిక్కిలి వల్లపుప్రదేశం. సముద్ర మట్టానికి సగటు ఎత్తు 30మీటర్లు. దీనివల్ల భూమి దున్నడం సులభం.*

"అర్థంతెలియని అవివేకులు అనర్థంలో పడి, నానార్థాలు పెంచుకుని, యదార్థాన్ని మరిచిపోతారు."

బచ్చలి: బచ్చలి రక్తహీనత, మలబద్ధకం, నరాలబలహీనత, న్యూరైటిస్, కంతులు, అనిద్ర, కీళ్ళనొప్పులు, స్థూల్యత, గొంతువాపు, అజీర్ణం మొదలగు వ్యాధులకు మంచిది. మూత్రాశయము, మూత్రపిండము మరియు కాలేయమునకు సంబంధించిన అనారోగ్యములకు కూడా బచ్చలి ఉపయోగపడుతుంది.



ముల్లంగి: ముల్లంగి రకాలన్నీ వచ్చడులలో ఉపయోగపడుతున్నాయి. ఇవి ముఖ్యంగా మలబద్ధకం, జలుబు, రొంప, స్థూల్యం లేక బలువు, క్షయ మున్నగువాటికి దివ్యమైనది. మూత్రకోశంలో రాళ్లను కరిగిస్తాయి.

దోస: ఇదికూడా వచ్చడులు (salads) చేసుకోవ డానికి ఉపయోగపడుతుంది. అనేక రోగాలకు ఇది అమూల్యమైనది. నోటిలో దంతములు మరియు చిగుళ్ల వ్యాధులకు ముఖ్యంగా పయోరియాకు అమోఘమైనది. శరీరంలో యూరిక్‌ఆమ్లము అధికమైనప్పుడు సంభవించే కీళ్లనొప్పులకు దోస మరియు కారట్ రసములు చేర్చిన మిశ్రమము ఔషధంగా ఉపయోగపడు తుంది. తలమీద వెంట్రుకలు ఆరోగ్యంగా నిగనిగలాడుతూ బొద్దుగా పెరగాలంటే దోస, కారట్ మరియు తోటకూర రసములను చేర్చి వాడండి.

కాబేజి: తాజాగా తీసిన కాబేజీరసం కడుపు పుళ్లను నివారిస్తుంది. నోటి చిగుళ్లను రక్తంకారుతూంటే పచ్చి కాలీఫ్లవర్ నమలం

నారింజలు: పుష్టికరమైన ఫలజాతుల నారింజలు ముఖ్యంగా ఉబ్బసం, రొమ్ముపడిశ క్షయ, న్యూమోనియా, వాతం, కీళ్లవాపు, కీ నొప్పులు, బ్లడ్‌ప్రెషర్‌కి సహకరిస్తాయి.

బొప్పాయి: బొప్పాయిరసము ప్రేగులలో క్రిముల నశింపజేస్తుంది. శ్లేష్మాన్ని కరిగిస్తుంది.

అనాసపండు: అనాసముఖ్యంగా గొంతువా (కణితి), జలుబు, పడిసం, బ్లడ్‌ప్రెషర్, కీ వాపులు, గడ్డలు మొదలైనవాటికి ఉపయో పడుతుంది.

'హెల్త్‌హెరాల్డ్' సౌజన్యం



## భారతదేశంలో మిక్కిలి పెద్ద స్పోర్ట్స్‌క్లబ్

*సభ్యత్వమును బట్టి, వివిధకార్యక్రమాలను బ బొంబాయిలోఉన్న ది క్రికెట్ క్లబ్ ఆఫ్ ఇండియ భారతదేశంలో మిక్కిలి పెద్ద స్పోర్ట్స్‌క్లబ్. ఈ క్లబ్ చెందిన చందరానా 77వ సం.రం వయస్సు క్రికెట్ ఆడటం విరమించుకున్నాడు.*

*—సిపిఐ & బ్రాబోర్న్ స్టేడియ*

"ఆకలితో మాడుతున్న కుక్కని చేరదీసి తిండి పెడితే, అది మిమ్మల్ని కరవదు. మనిషికీ, కుక్కకీ గల తేడా అక్కడే."

# వైద్యరంగం

## మీసిల్స్

విటలీ కారెట్నీ

మసూచిక, చిన్న అమ్మవారు, వేపపూవు ఆటలమ్మ అని వివిధ ప్రదేశాలలో వివిధపేర్లతో చెప్పుకునే తీవ్రమైన అంటురోగం మీసిల్స్. సామాన్యంగా చంటిపిల్లలకు మీసిల్స్ సుస్థిరమైన రోగనిరోధక శక్తిని కలిగిస్తుంది. అందుచేతే ఇది తిరిగి తిరిగి సంభవించడం చాలా అరుదు.

మీసిల్స్‌రోగం ఎగిరేసూక్ష్మజీవులవల్ల కలుగు తుంది. సాధారణంగా రోగి మాట్లాడేటప్పుడు, దగ్గినప్పుడు, తుమ్మినప్పుడు, గాలిద్వారా సూక్ష్మ జీవులు చుట్టుప్రక్కల ఉన్న ఆరోగ్యవంతుల శరీరంలో ప్రవేశిస్తాయి. మీసిల్స్ సూక్ష్మజీవుల జీవితకాలం చాల తక్కువ. మంచిగాలి, సూర్యరశ్మి మరియు అననుకూలమైన వాతావరణం వీటిని అతిసులభంగా నశింపజేస్తాయి.

మీసిల్స్‌వ్యాధి ప్రారంభించిన నాటినుంచీ అసలు అంతకుముందు మూడు నాలుగు రోజులనుంచీ 9-10 రోజులవరకు ఇది అంటురోగంగా పరిణమిస్తుంది. మొట్టమొదట ఏలక్షణాలు కనిపించకుండా ఇది ప్రారంభ మవుతుంది. సూక్ష్మజీవులు పెరిగి పెద్దవి అవడానికి 8 మొదలు 21 రోజులు పడుతుంది.

క్రమక్రమంగా మూడులక్షణాలు ప్రస్ఫుటంగా కనిపిస్తాయి. బిడ్డకు నెమ్మది ఉండదు. చపలత ఏర్పడుతుంది. పడిసెం, విపరీతమైన దగ్గు పట్టుకుంటుంది. జ్వరం తీవ్రంగా ఉంటుంది. కళ్లచుట్టూ ఎర్రటివలయాలు ఏర్పడతాయి. ఫ్లూజ్వర లక్షణాలు ఉంటాయి. అయినా కొన్ని ప్రత్యేక లక్షణాలుకూడా ఉంటాయి. రోగి మెల్ల కన్నుతో చూడడం ప్రారంభిస్తాడు. వెలుతురు అసలు సహించలేడు. కనురెప్పలు పుసులుకట్టి అంటుకుపోతాయి. నోటిని పరీక్షిస్తే నోటిలోపల తెల్లటిచుక్కలతో ఎర్రటిమచ్చలు ఉంటాయి. వీటినే ఫిలటోవ్స్ (Filatovs) మచ్చలు అంటారు. వీటిని కనిపెట్టిన రష్యన్ వైద్యుని పేరు వీటికి పెట్టబడింది. వ్యాధి ప్రారంభమైన మూడవరోజు మొదలు అయిదవ రోజులోపల జ్వరతీవ్రత తగ్గుతుంది. శరీరంమీద దద్దురులు లేస్తాయి.



"కాలేజీ చదువు నేర్చుకుంటే
కాబేజీ కాలీఫ్లవర్ అవుతుంది."

మీసిల్స్ దద్దురులు వివిధ పరిమాణాలలో ఎర్రరంగులో ఉంటాయి. తిరిగి జ్వరం 38-39° C పెరుగుతుంది. ఈ సమయంలో రోగులు అస్తమానం నిద్రమత్తులో ఉంటారు.

ఈ దద్దురులు తెరలు తెరలుగా వస్తాయి. మొట్టమొదట చెవుల వెనుక ప్రారంభమై తరువాత ముఖంమీదికి, ఆ తరువాత మెడ మీదికి ప్రాకుతుంది. రెండవరోజుకి గుండెలమీదికి, కడుపుమీదికి, వీపుమీదికి ప్రాకుతుంది. మూడవరోజుకి కాళ్లమీదికి ప్రాకుతుంది. ఈ ఎర్రటి దద్దురులు రెండు మూడురోజులు ఉంటాయి. తరువాత వాడుముఖంపట్టి కొంచెం ఇటుక రంగులోకి వస్తాయి. నాల్గవరోజుకి దగ్గు, పడిసెము, కళ్లమంట చాలావరకు తగ్గుతుంది. జ్వరం నార్మల్‌కి వచ్చేస్తుంది.

మీసిల్స్ వ్యాధివల్ల శరీరంలో పటుత్వం తగ్గిపోతుంది. అందుచేతే ఈ వ్యాధి తగ్గేటప్పుడు సులభంగా ఇతరరోగాలు, వ్యాధులు ఏర్పడడానికి అవకాశముంది. తరచుగా న్యూమోనియా, ఓటైటిస్, స్టోమాటైటిస్‌లతో క్లిష్టపరిస్థితులు కూడా ఏర్పడుతూంటాయి.

మీసిల్స్‌వ్యాధి వచ్చిన రోగికి విశ్రాంతి, మంచిగాలి, వెలుతురు, సక్రమపోషకాహారం, కాలానుగుణ్యంగా ఔషధం చాలాముఖ్యం.

వెలుతురు ఎక్కువగా తగులనీయకూడదు. కనురెప్పలు అంటుకుపోతే రెండు శాతం బోరిక్‌ఆమ్ల ద్రావణంతో కళ్లుతుడిచి వైద్యుడు చెప్పిన కంటిమందు చుక్కలు వేయాలి. రోగికి బాగా తాజాపళ్లు కాయగూరలు తినిపించాలి.

సామాన్యంగా రోగిసంపర్కం ఉండే ఒక సంవత్సరం అంతకంటే చిన్నపిల్లలకు గమ్మాగ్లోబ్యులిన్ (Gammaglobulin) ఇంజక్షనులు ఇప్పించాలి. వ్యాధిసోకిన అయిదురోజుల లోపల ఈ ఇంజక్షనులు వేయించాలి. మూడు మాసాలుదాకా పిల్లలకి టీకాల అవసరం ఉండదు. తల్లిపాలనుంచి పసిపిల్లలకు రోగ నిరోధకశక్తి ఏర్పడుతుంది. గమ్మాగ్లోబ్యులిన్ ప్రభావం శరీరంలో మూడు లేక నాలుగు వారాలపాటు ఉంటుంది.

●

## బాదంపాలు మెదడుకి శ్రేష్ఠమైనవి




*కొత్త మట్టికుండలో మంచినీళ్లు పోసి అందులో 10 బాదం గింజలు నానబెట్టాలి. నీటిలో నానిన బాదం గింజలను మరునాడు బాగా మెత్తగా రుబ్బాలి. ఈ బాదం రుబ్బును 12 మొదలు 16 ఔన్సులు కాచిన పాలలో బాగా కలపాలి. ఈ కలిపిన మిశ్రమాన్ని తిరిగి కాచి చల్లారనిచ్చి అవసరమైతే తేనెను కలపాలి. రుచికరమైన ఈ పానీయం మెదడుకు ఇతర శరీర అవయవాలకి బలాన్ని చేకూరుస్తుంది. శీతాకాలంలో ఏలకులపొడితో త్రాగితే శరీరానికి ఉత్తేజకరంగా ఉంటుంది.*

*-కెవిజె జి.ఎస్. వర్మ*

"గొప్ప గ్రంథమంటే ప్రతిఒక్కరూ
చదవాలనుకుంటూనే చదవనిది."

# ఆసక్తిదాయకమైన ఉత్తరాలు

డా. క్లైవ్ డి. హర్లీ

ఆసక్తిదాయకమైన జాబులు, ఉత్తరాలు ఎవరైనా వ్రాయవచ్చు. కానీ కొంతమందే వ్రాస్తారు. అసలు ఉత్తరాలు వ్రాయడానికి ఉత్సాహం, అభ్యాసం ఉండాలి. మంచిజాబు ఉత్తమరచనవంటి కళాఖండము. ఉచితమైన విషయం కలిగిఉండాలి. సముచితమైన రూపంలో తగినశైలిలో ఉండాలి. అంగీకారవైఖరి ప్రతిబింబిస్తూండాలి.



విషయము: ఉత్తరం వ్రాయడానికి కూర్చున్నప్పుడు మనసులో మొట్టమొదట నీఉత్తరం చదివేవారి అభిరుచిని గ్రహించు. అదిచాలా ముఖ్యం. నీ అభిరుచి అంత ముఖ్యంకాదు. నీఉత్తరం అందుకునేవారు వేసే ఏప్రశ్నకైనా పూర్తిజవాబుతో విషయం ప్రారంభంకావాలి. ఆలస్యం చేసినకొద్దీ దుర్లభం అనిపిస్తుంది.

ఉత్తరాలు నిశ్చయాత్మకంగా ఉండాలి. ఫిర్యాదులుగానీ, నీకు ఇబ్బందులు కలిగిస్తున్న విషయాలుగానీ వ్రాయకు. నీకు ఎదురయ్యే సమస్యలను ఏవిధంగా ఎదుర్కొంటున్నావో సూచించు. నీకష్టసుఖాలను గురించిగానీ, నీవిజయాలు గురించిగానీ ఎంత క్లుప్తంగా ఉండాలో అంతక్లుప్తంగా ఉండటంమంచిది. 'నేను' 'నాది' అనేవి వినిపించీ వినిపించని రహస్యంగా ఉండాలి. ప్రతీపుటలో 'నువ్వు' 'నీది' గింగురుమంటూ ప్రతిధ్వనిస్తూ ఉండాలి. అప్పుడే నీఉత్తరం ఉత్సాహంతో పూర్తిగా చదవబడుతుంది. వెంటనే జవాబువస్తుంది.

రూపం: నీఉత్తరం ఎప్పుడూ నిర్మాణకౌశలంతో ఉండాలి. ఉత్తరాన్ని పేరాలుగా విభజించుకో. ప్రతీకొత్త అంశం లేక విషయానికి ఒక ప్రత్యేకమైన పేరా ఉండాలి. వాక్యాలు ఎంత చిన్నవిగా వీలవుతుందో అంతచిన్నవిగా వ్రాయాలి. రచనకు ఉపయోగించే పదజాలంలో పటుత్వం ఉండాలంటే విస్తృతంగా వాఙ్మయం చదవాలి. పాఠకులకు అర్థంకాని మాటలు ఎప్పుడూ ఉపయోగించవద్దు.

[redacted]

"శరీరశ్రమతో కూడినప్పుడే 'పని' అవుతుంది. లేకపోతే 'పని' అనిపించుకోదు-వినోదం."
—మార్క్ ట్వైన్

నీఉత్తరానికి సరైన రూపంఇవ్వు. వ్రాసే ముందు పథకంవేసుకో. వాటికి తగినట్టుగా ప్రతీవిషయంమీద ఒకటి రెండు చిన్నచిన్న పేరాలు సులభంగా వ్రాయవచ్చు. చదివేవారికి నీఉత్తరం ఎంతో ఆసక్తికరంగా ఉంటుంది. మరికాస్త ఎక్కువగా వ్రాస్తేబాగుండును అని పిస్తుంది.

శైలి: ఉత్తరం ఎప్పుడూ గొప్పసాహిత్యశైలిలో వ్రాయవద్దు. ముఖాముఖీగా మాట్లాడుకుంటూ న్నట్లు సామాన్యంగా వాడే సులభమైన మాటలతో ఉత్తరం వ్రాయి. పాఠకుడు నీ ఉత్తరం చదువుతూంటే నీవు మాట్లాడుతూన్న ట్లుండాలి. లేకపోతే హృదయపూర్వకంగా ఉండదు. ముఖ్యంగా నీకు సంభవించిన ప్రమాదం గురించిగానీ, నీపొరపాటు గురించి గానీ వ్రాసినప్పుడు అతి సున్నితంగా హాస్యం ప్రతిబింబిస్తూండాలి.

నీ ఉత్తరాలెప్పుడూ నేర్పుగా, సామర్థ్యవంతంగా ఉండాలి. నీవు వ్రాసే ఉత్తరంలో ఇతరుల పొరపాట్లు గురించిగానీ, లోపాలను గురించి గానీ ప్రస్తావించకు. ప్రాణాంతకమైతే తప్ప అటువంటి వాటిని వదిలి పెట్టడం ఉత్తమం. అనాగరీకంగా, మోటుసరిగా ఉండే విషయాలు వదిలి పెట్టు. నేర్పుతో, హాస్యంతో సంభాషణ రూపంలో ఉండే రచనాశైలి ఆసక్తికరంగా ఉంటుంది.

వైఖరి:ఉత్తరం ప్రవృత్తికి సందర్భోచితంగా ఉండాలి. చదివేవారికి వ్రాసే విషయం, వ్రాసే వైఖరి శైలిలో ప్రదర్శింపబడుతుంది. ఉత్తరం వ్రాసేముందు తేటతెల్లంగా ఉండాలి. నిశ్చయం చేసుకో ఏవైఖరిలో ఉండాలో ఉత్తరం అంతా అదేవైఖరిలో ఉండాలి.

ఈ నాలుగు ప్రాతిపదిక విషయాలను జాగ్రత్తగా గమనిస్తే నీవు వ్రాసే ఉత్తరాలు ఎంతో ఆసక్తి దాయకంగా ఉంటాయి. నీ ఉత్తరాలు చదివేవారికి సంతృప్తికరంగా, ఆనందదాయకంగా ఉంటాయి.

## తన పని తానే చూసుకోడం మొదలుపెట్టాడు!



*ఒక యువకుడు ఇంకొకరి క్రింద ఉద్యోగం చేయడానికి విసుగెత్తి పోయి తనకు తానే పని చేసుకోవడం ప్రారంభించాడు. తరువాత ఒక స్నేహితుడు తటస్థపడి నీ మీద నీ పెత్తనం ఎలా ఉంది అని అడిగాడు. 'నాకేం తెలియదు. పోలీసు వాళ్లు నా ఇంటి ముందు నా కారుని పార్కు చేసుకోనివ్వరు. పన్నులు పసూలు చేసే వాళ్లు ఎప్పటికప్పుడు బుక్స్ ఎలా మెయిన్‌టైన్‌చేయాలో చెబుతారు. నా బాంకరు నేను బాంక్‌లో కనీసం ఎంత మొత్తం ఉంచాలో చెబుతాడు. సరకు ఎలా పాక్ చేయాలో ట్రాన్స్ పోర్ట్ కంట్రాక్టరు చెబుతాడు. సరకులు ఎలా ఉండాలోకొనుగోలుదారులు చెబుతారు. ప్రభుత్వం వారు, మునిసిపాలిటీ వారు రికార్డులను ఎలా తయారు చేయాలో చెబుతారు. పైగా నాకు ఈ మధ్య పెళ్లి కూడా అయింది' అని వాపోయాడు.*

"వుండున్న చోటే వుల్ల తగులుతుంది,
గోరుచుట్టు మీద రోకటి పోటు."

# మీ విజ్ఞానం పరీక్షించుకోండి

## క్విజ్

1. భారతదేశంలో ముఖ్యంగా జనపనారను ఉత్పాదించే ప్రదేశము:
(ఎ) బీహార్, (బి) ఒరిస్సా, (సి) త్రిపుర, (డి) పశ్చిమబెంగాల్.
2. ప్రపంచ ప్రసిద్ధిపొందిన రాజకీయ వ్యంగ్య చిత్రకారుడు:
(ఎ) సి.రామస్వామి, (బి) విజయ్‌టెండూల్కర్, (సి) దుర్గాదాస్, (డి) ఆర్.కె.లక్ష్మణ్.



3. పాల్ఘాట్ మణి అయ్యర్ గొప్ప ..... వాద్య నిపుణుడు.
(ఎ) ఫిడేల్, (బి) సితార్, (సి) ఫ్లూట్, (డి) మృదంగ.
4. గాంధేయ ఆర్థిక వ్యవస్థ ఈసిద్ధాంతంపై ఆధారపడి ఉంది:
(ఎ) పోటీ, (బి) స్టేట్ కంట్రోల్, (సి) ట్రస్టీషిప్ ప్రిన్సిపిల్, (డి) పైవిఏవీకావు.
5. 'రామరాజ్య' భావనను ఎవరు ప్రతిపాదించారు?
(ఎ)రామకృష్ణ పరమహంస, (బి) దయానంద సరస్వతి, (సి) లాలాలజ్‌పత్ రాయ్, (డి) గాంధీజీ.
6. MIG - 29 ఫైటర్ ఎయిర్‌క్రాఫ్టులు ఎక్కడ తయారుచేయబడుతున్నాయి?
(ఎ) యునైటెడ్‌స్టేట్స్, (బి) బ్రిటన్, (సి) ఫ్రాన్స్, (డి) సోవియెట్ యూనియన్.
7. ప్రపంచంలో అత్యధిక పుట్టుకరేటు ఇక్కడ ఉంది:
(ఎ) బంగ్లాదేశ్, (బి) కెన్యా, (సి) చైనా, (డి) భారతదేశం.
8. 'ఓజోన్‌పొర' చాలాముఖ్యం - ఎందుకంటే?
(ఎ) ఇది కిరణ జన్య సంయోగక్రియకు సహకరిస్తుంది, (బి) అతినీలలోహిత కిరణాలకు అవరోధం కలిగిస్తుంది, (సి) అతినీలలోహిత కిరణాలకు సెలక్టివ్ ఫిల్టర్‌గా ఉపయోగపడు తుంది, (డి) పైవిఏవీకావు.

## 90 సంవత్సరాలలో నూనె [illegible] హరించిపోతాయి

[illegible]

"విద్య ఉంటే వినయం ఉండదు. విద్యావినయాలు ఉంటే రూపం ఉండదు. ఈ మూడూ ఉంటే సౌభాగ్యం ఉండదు."

## తెలివికి పరీక్ష

1. క్రింది వరుసలో ఇముడనిది ఏది?
దీ టైమ్స్ ఆఫ్ ఇండియా, ది హిందూ, దిస్టేట్స్‌మన్, డెక్కన్ హెరాల్డ్, గార్డియన్, పయొనీర్.
2. ఈవరుసలో తరువాతి రెండు సంఖ్యలు ఏవి?
48 40 38 30 28 — — ?
3. గ్రీన్‌లాండ్‌ను కనుగొనక పూర్వం పెద్ద ద్వీపం ఏది?
4. ఈక్రింది వాటన్నిటికీ ఏది సమానాంశము?
ఇటలీ, ఫ్రాన్స్ స్పెయిన్ ఆస్ట్రియా, బెల్జియం, నెదర్‌లాండ్స్.
5. విద్య వినయాన్ని కలిగించాలేగానీ ఏది కారాదు?
6. ఈకావ్యంలోలేని విషయం ఎందులోనూలేదు? ఇతరత్రా లేనివిషయాలు ఎన్నో ఈ కావ్యంలో ఉన్నాయి. అదిఏది?
7. భావాన్ని మార్చకుండా భాషను మారుస్తే అదిఏమవుతుంది?
8. మౌనం భావానికి చెందినది, భాష రూపానికి చెందినది, అయితే ఈరెంటికీ గల సంబంధం ఏమిటి?

## మాటల మహిమ

1. కలరవము: అవ్యక్త మధురధ్వని (ఎ), పావురము (బి), కోకిల (సి), కాకి (డి).
2. కలవరము: కలత (ఎ), చింత (బి), కలవరింత (సి), ఏనుగు (డి).
3. కూటము: చావడి (ఎ), సభాభవనము (బి), అసత్యము (సి), చలింపనిది (డి).
4. గాదిలి: ప్రేమ (ఎ), చుట్టము (బి), వృత్తాంతము (సి), సమాచారము (డి).
5. కైలాటము: నమస్కారము (ఎ), మాయ (బి), మోసము (సి), కైంకర్యము (డి).
6. వావి: అనుకూలమైన సంబంధయోగ్యత (ఎ), వాక్పారుష్యము (బి), అధికము (సి), పరిమితి (డి).
7. వమ్ము: వ్యర్థము (ఎ), నష్టము (బి), వివర్ణము (సి), క్రమము (డి).
8. వలచు: అపేక్షించు (ఎ), మోహించు (బి), బలము (సి), కోరు (డి).

(జవాబులకు వ పేజీ చూడండి)

## కాన్సర్ నిరోధకం



*ఆయుస్సును పెంచుకోవాలంటే:*

1. *తాజా కాయగూరలు: కాలిఫ్లవర్, కాబేజి వంటి కాబేజి కుటుంబానికి చెందిన కాయగూరలు అనేక రకాల కాన్సర్‌ను నిరోధిస్తాయి.*
2. *పీచు: గోధుమపిండి రొట్టె, ధాన్యాలు, ఆపిలు మరియు టొమాటోపళ్లు, ఇతర కాయగూరలు ప్రేగుల కాన్సర్‌ను రానీయవు.*
3. *విటమిను A: చేపలు, ముదురు ఆకుపచ్చమరియు ముదురు పసుపురంగు కాయగూరలు ఊపిరితిత్తులకు రక్షనిస్తాయి. నోటి కాన్సర్‌ను రానీయవు.*
4. *విటమిను C: నారింజ, నిమ్మవంటి సిట్రస్ పళ్లు, స్ట్రాబెర్రీలు, మొలకెత్తే ధాన్యాలు, పప్పులు, పచ్చి మిరియాలు అన్నవాహికలోను, కడుపులోను కాన్సర్‌ను రానీయవు.*

*-'హెల్త్' సౌజన్యంతో*

"ప్రీతికలిగే మాటలు చెప్పేవారు అయాచితంగా పలువురు లభిస్తారు. శ్రేయస్సు కోరి హితవుగా మాట్లాడేవారు అరుదు."

# ఉపన్యాసం అద్భుతంగా ఉండాలంటే?

పి.ఎస్.బాంటియా

అద్భుతమైన ఉపన్యాసవైఖరి పుట్టుకతో వచ్చేవిద్యకాదు. చిత్తశుద్ధితో, విశ్వాసంతో ఓపికగా శ్రమపడితేగానీ మంచి ఉపన్యాసధోరణి అలవడదు. ఇది ఒక్కరోజులో లభించే సామర్థ్యం కాదు. ఉత్తమ సాహిత్యాభిలాషతో, ఏకాగ్రతతో, వివేకంతో వివిధగ్రంథాలు పఠించడం వల్ల మంచి వక్తగా రూపొంద వచ్చు. పట్టుదలతో దీనిని సాధించదలచిన వారికి గణిత సూత్రప్రాయంగా దీనిని వివరించవచ్చు. సన్నాహం × అభ్యాసం × సమర్పణ ఫలితమే అద్భుత ఉపన్యాసం. ప్రతీదశ వివరంగా తెలుసుకోవడం అవసరం.



1. సన్నాహం: ప్రతీప్రసంగం, ప్రతీ ఉపన్యాసం అతిజాగ్రత్తగా సిద్ధపరచుకోవాలి. నీవు ప్రసంగించ వలసిన విషయం గురించి నీకు సమగ్రంగా తెలియనప్పుడు ఆవిషయానికి సంబంధించిన గ్రంథాలను అమూలాగ్రంగా చదివి విషయాన్ని సంగ్రహించుకోవాలి. ప్రసంగ విషయం పరి పూర్ణంగా తెలిసి ఉన్నా నీ ఉపన్యాసాన్ని పూర్తిగా వ్రాసి సిద్ధపరచుకోవడం ఎంతో ఉత్తమం. దీనివల్ల ఆలోచనలు వరుస క్రమంలో ఉంటాయి. అనవసరమైన మాటలు, పొల్లుపదాలు ఉండవు. ప్రసంగాలను ఈవిధంగా సిద్ధం చేసుకోనివాళ్లు ఉపన్యాసం మధ్యలో తడుము కోవలసి వస్తుంది. శ్రోతలకు సంతృప్తి ఉండదు.

సుప్రసిద్ధవక్తలు అందరూ తమప్రసంగాలను ముందుగానే సిద్ధం చేసుకుంటారు. అమెరికా




అధ్యక్షుడు కెన్నెడీ అయిదురోజులపాటు ఏకాంతంగా ఆలోచించి ప్రయత్నించి తవ

**అన్నిగ్రామాలకు విద్యుత్ సౌకర్యం కలిగించిన మొదటి రాష్ట్రం**

[illegible]

"ఆత్మబలం లేనివాళ్లు ఎంత చిన్న కష్టం వచ్చినా క్రుంగిపోతారు."

అర్థగంట ప్రారంభోపన్యాసాన్ని తయారుచేసాడు. విన్స్టన్ చర్చిల్ గంటలకొద్దీ ఆలోచించి ఉపన్యాసాలను తయారుచేసేవాడు. ఇక అబ్రహాం లింకన్ తయారుచేసుకున్న ఉపన్యాసాలు అందరికీ తెలిసినవే.

2. అభ్యాసం: అభ్యాసము కూనువిద్య. అభ్యాసం వల్ల మానవుడు పరిపూర్ణుడు అవుతాడు. ఉపన్యాసం తయారుచేసుకోడానికి కూడా ఇది అనువర్తిస్తుంది. ముందుగా విషయాన్ని గురించి అభ్యాసం చేసుకోనివాళ్లకి అసలు


Churchill

విషయం క్రొత్తగా ఉంటుంది. ప్రసంగం పరిపూర్ణంగా ఉండాలనే లక్ష్యాన్ని సాధించాలంటే అభ్యాసం చేయకతప్పదు. సభలో సభ్యులు, శ్రోతలు అత్యంత ఉత్సాహంతో ఆనందంగా నవ్వగలిగినప్పుడు, ప్రసంగం నాటకీయతతో సభాసదులకు ఆశ్చర్యం కలిగించినప్పుడు ఉపన్యాసం యొక్క ముఖ్యఉద్దేశం పరిపూర్ణంగా సిద్ధించింది అనుకోవాలి. సభికుల ముందు ప్రసంగం సరసంగా, సమగ్రంగా ఉండాలంటే ఒక అద్దంముందు నుంచుని అనేకసార్లు నీ ఉపన్యాసాన్ని రిహార్సల్ చేసుకో. నీవు ఇచ్చే ఉపన్యాసం నీవే విని దాని ధోరణి తెలుసుకోడానికి టేప్‌రికార్డరులు చాలా సహకరిస్తాయి.

అత్యవసర విషయాన్ని గురించి చర్చించడానికి విన్స్టన్ చర్చిల్ పడకగదిలోకి ఒకరు వస్తే కోపంతో 'నేను హౌస్ ఆఫ్ కామన్స్ సభలో ఉపన్యాసం తయారుచేసుకుంటూంటే మధ్యలో ఎందుకు చికాకు కలిగిస్తావు?' అనేవాడు. విన్స్టన్ చర్చిల్ ప్రతీ ఉపన్యాసాన్ని సభికులకు తగినట్టుగా తయారుచేసేవాడు.


ABRAHAM LINCOLN

3. సమర్పణ: మెరుగులు దిద్దడం ముఖ్యం. ఉపన్యాసం విజయవంతంగా ఉండడానికి ఇది సహకరిస్తుంది. ఎంత మంచి బహుమానమైనా పైపాకింగ్ కంటికి సదురుగా ఆకర్షణీయంగా లేకపోతే దానికి విలువ ఉండదు. అదేవిధంగా పైపైమెరుగులు లేకపోతే ఉపన్యాసానికి విలువ ఉండదు. మంచి కంఠస్వరం, మాటల ఉచ్చారణ, సరసమైన ఆలోచనా సరళి, ఉపన్యాసపుశైలి ఉంటే ఉపన్యాసం బ్రహ్మాండంగా ఉంటుంది. మాటల ఉచ్చారణ స్వచ్ఛంగా ఉండడానికి, ఉపన్యాసవైఖరి సరళంగా ఉండడానికి, కంఠస్వరం సరిచేసుకోడానికి ప్రతీరోజూ బిగ్గరగా చదువుతూండు. అబ్రహాంలింకన్ ప్రతీరోజూ గట్టిగా తన ఉపన్యాసాన్ని అనేకసార్లు చదువుతూండేవాడు. భార్య 'నువ్వు గట్టిగా చదవడం న్యూసెన్స్'

"విద్యావంతుడు కానివాని జీవితం నిరర్థకం,
విద్య వివేక హేతువు."

అని విసుగుచెందినా అబ్రహాంలింకన్ తన అభ్యాసాన్ని మానేవాడు కాదు.

శ్రోతలు ముఖాలను బట్టి ఒకరి ఉపన్యాసం విలువ సులభంగా తెలుస్తుంది. ఉపన్యాసం ఇచ్చేటప్పుడు ఉపన్యాసకుడు శ్రోతల ముఖాలను పరిశీలిస్తూండాలి. అప్పుడు ప్రసంగం పటుత్వం తెలుస్తుంది. ఒకసారి మార్క్‌ట్వైన్ సాయంకాలం 7 గంటలకు ఉపన్యాసం ఇవ్వవలసి ఉంది. ఇతడి అభిమానులు 5000 మంది వచ్చి


MARK TWAIN

కూర్చున్నారు. ఎంతసేపైనా రాలేదు. ఆఖరుకి మార్క్‌ట్వైన్ ఈదినం రాలేకపోయినందుకు విచారిస్తున్నామని, మరునాడు 7 గంటలకు ప్రసంగం ఉంటుందని ప్రకటించారు. మరునాడు 1000 మంది మాత్రమే సభకు వచ్చారు. మార్క్‌ట్వైన్ ఆరోజుకూడా రాలేదు. ప్రసంగం మరునాడు 7 గంటలకు ఉంటుందని తిరిగి ప్రకటించారు. ప్రకటన ప్రకారం ఉపన్యాసం ఇవ్వడానికి 7 గంటలకు మార్క్‌ట్వైన్ వచ్చాడు. వినడానికి 500 మంది మాత్రమే వచ్చారు. శ్రోతలు అందరూ కోపంతో చెలరేగిపోయి ప్రతికూలంగా ఉన్నట్టు ట్వైన్ గమనించాడు. మార్క్‌ట్వైన్ ఇంతకుముందు ప్రోగ్రాం ప్రకారం రెండురోజులు రానందుకు క్షమాపణతో ప్రసంగం ప్రారంభించలేదు. 'సోదరసోదరీ మణులారా! నేనుకావాలనే రెండురోజులు రాలేదు. అవివేకులైన మూర్ఖుల ముందు నేను ఉపన్యసించదలచుకోలేదు. మీవంటి ఏకొద్దిమంది ప్రసిద్ధులముందు ప్రసంగించదలచు కున్నాను' అని ఉపన్యాసం ప్రారంభించాడు. వెంటనే సభికులు ఉత్సాహంతో శాంతంగా వినడానికి ప్రారంభించారు.

మంచి భోజనం తయారుచేయాలంటే వివిధ పదార్థాలు రుచికరంగా ఉండాలి, తగిన ఉప్పు, కారం ఉండాలి. వేడివేడిగా ఉండాలి. అదేవిధంగా సన్నాహం, అభ్యాసం, సమర్పణ అనేమూడు విధానాలను మేళవించి సమయ స్ఫూర్తితో చేసిన ఉపన్యాసం సభికులను అందరినీ ఆకట్టుకుంటుంది. ఈదినమే సుదినం, ప్రారంభించండి.

## యునైటెడ్‌స్టేట్స్ అత్యధికంగా విదేశీనిపుణులను వినియోగించుకుంటూంది

*యునైటెడ్ స్టేట్స్ అత్యధికంగా విదేశీనిపుణులను వినియోగించుకుంటూంది. అమెరికన్ అకాడమీ ఆఫ్‌సైన్సెస్ సభ్యులలో 30 శాతం అమెరికా దేశానికి చెందనివారు. యునైటెడ్‌స్టేట్స్ ఇమిగ్రేషన్ సర్వీస్ వారి సమాచారాన్ని బట్టి 80వదశాబ్దంప్రథమభాగంలో అభివృద్ధి పొందుతూన్న దేశాలనుంచి వచ్చిన 150,000 నిపుణులు యునైటెడ్ స్టేట్స్‌లో ఉద్యోగాలు చేస్తున్నారు. వీరిలో 45,000 మంది ఆసియా నుంచి వచ్చినవారే.*

"సహనం చేదుగా ఉన్నా ఫలితం మధురం."

—రూసో

# అక్కడా-ఇక్కడా

## భారతదేశంలో మిక్కిలి పెద్ద నియోజకవర్గము

రాజస్థాన్ బార్మర్ లోక్‌సభ నియోజక వర్గంలో 11.07 లక్షవోటర్లు ఉన్నారు. దేశంలోని



ఈ మిక్కిలి పెద్ద నియోజకవర్గంలో బార్మర్ మరియు జెయ్‌సాల్మర్ అనే రెండుపెద్ద ఎడారి జిల్లాలు, జోద్‌పూర్ జిల్లాలో కొంతభాగం చేరిఉంది.

* * *

## భారతదేశంలో మొట్టమొదటి టెస్ట్‌ట్యూబ్ క్వాడ్రుప్‌లెట్స్

బొంబాయిలో ఒక ప్రైవేటు హాస్పిటల్‌లో 36 సంవత్సరాల యువతి మనదేశంలో మొట్ట మొదట ఒకేసారి నలుగురు టెస్ట్‌ట్యూబ్ పిల్లలను కన్నది. ఇన్-విట్రో ఫలదీకరణము (in-vitro fertilisation) మరియు గర్భస్థపిండం మార్పిడి వల్ల ఈమె గర్భం ధరించింది.

* * *

## వరిమొక్కలు నాటే యంత్రసాధనం

ఫిలిప్పైన్స్ మనిలాలో అంతర్జాతీయ వరి పరిశోధకసంస్థ (International Rice Research Institute) వరి మొక్కలను అతినులువుగా, ఎక్కువ ఖర్చులేకుండా నాటడానికి యంత్ర సాధనాన్ని అభివృద్ధి చేసింది. దీనివల్ల నడుంవిరిగేటట్టు వరినాటడం అవసరం ఉండదు. ఈప్రత్యేక సాధనంతో ఒక మనిషి వంగే అవసరంలేకుండా నిట్టనిలువుగా నుంచుని సాంప్రదాయకంగా ఆరుమంది వంగుని చేసే పనిని అతిసౌలభ్యంగా చేయ గలుగుతాడు.

'సిఇఇ.ఎన్ఎఫ్ఎస్' సౌజన్యంతో

* * *

## భారతదేశంలో మొట్టమొదటి ఫైబర్ ఆప్టిక్ యూనిట్

ఆప్టికల్ ఫైబర్ కేబిల్స్ ఉత్పాదనకు భారతదేశంలో మొట్టమొదటి ఫైబర్ ఆప్టిక్ యూనిట్ మధ్యప్రదేశ్ భోపాల్ దగ్గర మండి దీప్‌లో స్థాపించబడింది. ముఖ్యంగా టెలి కమ్యూనికేషన్స్‌లో దీనిని అధికంగా వాడతారు.

* * *

## మాస్కోదేశపు మొదటి భరతనాట్యంస్కూలు

సోవియెట్ యూనియన్‌లో మిక్కిలి పెద్ద పారిశ్రామిక సంస్థ క్రాస్నీ ప్రొలిటేరియెట్ నిర్వ హించే క్లబ్‌వారు మాస్కోదేశపు మొట్టమొదటి భరతనాట్య పాఠశాలను ప్రారంభించారు.

* * *

"మనిషికి అంతర్యాన్ని అనుసరించి ఆలోచనలు, ఆలోచనలను అనుసరించి ఆచరణ ఉంటుంది."

—గొయిథే

## ఉల్లి ఎగుమతులు సాలీనా 13 శాతం పెరుగుతున్నాయి

భారతదేశంలో ఉల్లి ఎగుమతులు సాలీనా 13 శాతం పెరుగుతున్నాయి. ఉల్లి ఎగుమతులలో నెదర్‌లాండ్స్ తరువాత భారతదేశం రెండవ




స్థానాన్ని పొందుతూంది. భారతదేశపు ఉల్లి వ్యాపారం ముఖ్యంగా యునైటెడ్ అరబ్ ఎమిరేట్స్, సౌదీ అరేబియా, సింగపూర్, మలేషియా, జపాన్, శ్రీలంకా, బంగ్లాదేశ్ మరియు సోవియెట్ యూనియన్‌లతో విస్తారంగా జరుగుతూంది.

'బాంబే ఛాంబర్ ఆఫ్ కామర్స్ అండ్ ఇండస్ట్రీ' సౌజన్యంతో

* * *

## 30,000 నుండి 5,000 డిగ్రీలకు చల్లబడిన ఇజి సగిట్టా నక్షత్రం

సుమారు 8,000 కాంతి సంవత్సరాల దూరంలో ఉన్న ఇజి సగిట్టా (Eg Sagitta) నక్షత్రం 1950లో 30,000 డిగ్రీల నుండి ఇప్పుడు 5,000 డిగ్రీలకు చల్లబడింది. ఈవిధంగా చల్లబడటం వల్ల సూర్యగోళానికి రెండింతలు ఉన్న ఈనక్షత్రం ప్రమాణం 1000 రెట్లు పెరిగింది. నక్షత్ర తలంమీద బేరియం, స్ట్రాంటియం, లాంథానియం వంటి అధిక భారలోహాలు (heavy elements) కనిపించడం వల్ల ఇక్కడ ఉదజని పూర్తిగా వినియోగమైనట్లు తెలుస్తూంది. ఇది ఇక 75,000 సంవత్సరాలలో భూమి పరిమాణానికి తగ్గిపోతుందని యునైటెడ్ స్టేట్స్ లిక్ ఖగోళపరిశోధకశాలలో శాస్త్రజ్ఞులు అభిప్రాయాన్ని వెలిబుచ్చారు.

* * *

## ఖ్వాసార్ 130 బిలియన్ ట్రిలియన్ కిలోమీటర్ల దూరంలో ఉంది

ఆస్ట్రేలియా దేశపు శాస్త్రజ్ఞులు సుమారు 130 బిలియను ట్రిలియన్ కిలోమీటర్ల దూరంగా ఉన్న ఖ్వాసార్‌ను కనుగొన్నారు. ఖ్వాసార్ నుంచి వచ్చే కాంతి టెలిస్కోప్ (దూరదర్శిని) ద్వారా ప్రసరించడానికి 13.8 బిలియన్ సంవత్సరాలు పట్టి ఉండాలి.

## క్రొత్త పోర్టబుల్ వీడియో కెమెరా

[illegible]

"ధర్మబద్ధమైన కోరికలను సాధించినప్పుడు పొందే ఆనందమే నిజమైన ఆనందం."

# ఇగుఆజు పార్కు

విశ్వవిఖ్యాతి పొందిన ముఖ్యప్రదేశాలలో ఇగుఆజు (Iguazu)పార్కు ఒకటి అని ది వరల్డ్ హెరిటేజ్ కమిటీ వారు నిర్ణయించారు. మిక్కిలి సుందరాతి సుందరమైన ఈపార్కులో ప్రపంచంలో మిక్కిలి ఎత్తుగా గంభీరంగా ఉండే జలపాతం ఒకటి ఉంది. ఈ పార్కులో



చెట్లు మీద నివసించే ముళ్లవంది, జాగుర్ (అమెరికా చిరుత), రాక్కూన్ ఎలుగుబంటి ఉన్నాయి. ఈ పార్కులో ఉండే మొత్తం 400 పక్షుల జాతులలో మిక్కిలి పెద్ద స్విఫ్ట్‌లు ఉన్నాయి. ఇవి ప్రపంచంలో మరెక్కడా కనిపించవు. మంచి రంగులతో ప్రకాశిస్తున్న సీతాకోక చిలుకల రెక్కల నిడివి 15సెం.మీ.లు ఉంటుంది. పార్కుమొత్తం వైశాల్యం 55,000-హెక్టేరులు.

ఉష్ణమండలపు వర్షారణ్య భాగమైన ఈ పార్కులో 2,000జాతుల మొక్కలు, చెట్లు రికార్డు చేయబడ్డాయి. వీటిలో గువాపోయ్ అనే అత్తి చెట్టు మొలిచి ప్రవృద్ధిచెంది కాండంతో దగ్గర ఉండే చెట్టును ఊపిరి తిరుగనీయకుండా పెనవేసుకుపోతుంది.

ఇగుఆజు జలపాతం 2,700 మీటర్లవెడల్పు ఉంటుంది. ఈశ్రేణిలో మొత్తం 300 జలపాతాలు ఉన్నాయి. కొన్ని 80మీటర్ల ఎత్తునుంచి ప్రవహిస్తూ ఉంటాయి. ఇగుఆజు అంటే గురానీ భాషలో బ్రహ్మాండమైన నీటి ప్రవాహం (గ్రేట్‌వాటర్) అని అర్థం. ప్రతీసంవత్సరం 200,000మంది దీనిని సందర్శిస్తారు. ఇది ఏ సంవత్సరానికాసంవత్సరం అధికం అయిపోతూంది.

—'యునెస్కో ఫీచర్స్' సౌజన్యంతో

[redacted]

## ఓడకు జరిగిన ఘోరప్రమాదం

*రెండవ ప్రపంచ యుద్ధసమయంలో జనవరి 30, 1945న ఒక రష్యన్ జలాంతర్గామి 25,484 టన్నుల విల్‌హెల్మ్ గుస్ట్‌లాఫ్ అనే జర్మను ఓడను వగులగొట్టింది. ఓడపూర్తిగా ధ్వంసం అయిపోయింది. సుమారు 7,700 మంది ప్రాణాలు పోయాయి. ఒకే ఓడకు జరిగిన ఘోరప్రమాదం ఇది.*

"వ్యక్తిగతమైన ఇష్టాలను అధిగమించి
పరమసత్యాన్ని ఎదుర్కోడమే వ్యక్తి కర్తవ్యం."

# ఆయుర్దాయాభివృద్ధికి అన్వేషణ

ప్రతీమానవుడు సుఖసంతోషాలతో దీర్ఘకాలం జీవించాలనే కోరుకుంటాడు. దానికి తగినట్లు అనేకమార్గాలు నిరంతరం అన్వేషిస్తాడు. మానవుడు ఆయుర్దాయాభివృద్ధికి, సుదీర్ఘమైన యౌవ్వనానికి, తరగని శక్తిసామర్థ్యాలకు అనేకమార్గాలు వెదుకుతూంటాడు. మానవుని



ఈ నిరంతర అన్వేషణకు తేనెటీగల సహకారం అమూల్యమైనదని శాస్త్రజ్ఞులు అభిప్రాయ పడుతున్నారు. తేనెపట్టులో రాణి ఈగకు పెట్టే ప్రత్యేకఆహారంలోఅమృతతుల్యమైన పాలవంటి పదార్థమే దీనికిటుకని శాస్త్రజ్ఞులు అంటున్నారు. దీనిని రాయల్‌జెల్లీ అంటారు. తేనెటీగలను పెంచే బీకీపర్స్‌కి ఈ జెల్లీ రహస్యం దీర్ఘకాలం పాటు అర్థంకాలేదు. ఒక శాస్త్రజ్ఞుడు పరిశోధించి తేనెపట్టులో మొదట మూడురోజులు గ్రుడ్డునుండి వచ్చిన లార్వా పురుగులకుదాది తేనెటీగలు ప్రత్యేకంగా జీర్ణింపబడిన ఆహారాన్ని ఇస్తున్నాయని తెలుసుకున్నాడు.

అంతేగాకనాల్గవ రోజున సేవకులు అసంఖ్యాకమైన లార్వాపురుగులలో ఒక దానిని భావికాలపు రాణిగా ఎన్నుకుంటాయన్ని, ఈ విధంగా ఎన్నుకున్న దానికి ప్రత్యేకంగా జీర్ణింపబడిన ఆహారం బ్రూడ్‌ఫుడ్ ఇస్తాయన్ని, ఇతర లార్వాపురుగులకు సామాన్య ఆహారానికి తేనెపుప్పొడిని కలిపి ఇస్తాయని కూడా తెలుసుకున్నాడు. జీర్ణింపబడిన బ్రూడ్‌ఫుడ్‌కి దాది తేనెటీగలు వాటితలలో ఉండే లాలాజలగ్రంధినుంచి స్రవించే ఒక అద్భుత పదార్థాన్ని కలుపుతాయని ఒక ఫ్రెంచి శాస్త్రవేత్త తెలుసుకున్నాడు.

జీవితకాలం అంతా రాణిఈగకు ఈ ప్రత్యేకమైన రాయల్‌జెల్లీని ఆహారంగా ఇస్తాయి. 16 రోజులలో గ్రుడ్డునుండి పెరిగి రాణి ఈగగా తయారవుతుంది. సామాన్యంగా సేవకునికిగానీ సోమరి మగ ఈగకుగానీ పెరిగి పెద్దది అవడానికి 21-మొదలు 24 రోజులు పడుతుంది. ఇతర తేనెటీగల కంటే రాణి ఈగ పరిమాణంలోనూ, బరువులోను రెండింతలు అధికంగా ఉంటుంది. ఇది సాధారణంగా మూడుమొదలు అయిదు సంవత్సరాలు జీవిస్తుంది. సేవక ఈగల సగటు జీవితకాలం ఆరుమొదలు ఏడు వారాలు మాత్రమే. రాణిఈగ పట్టునుంచి ఎగిరివెళ్లి మగదానితోకూడిన తరువాత తిరిగి పట్టుకు చేరుకుంటుంది. మూడు నాలుగు రోజులలో పట్టులో ఉండే ప్రతీకాళీఅరలోను అసంఖ్యాకమైన గ్రుడ్లను పెడుతుంది. సర్వసామాన్యంగా రాణిఈగ 1500 గ్రుడ్లను పెడుతుంది. ఈ మొత్తంగ్రుడ్లు రాణిఈగ బరువుకు సమానంగా ఉంటాయి.

ప్రోటీనులు పుష్కలంగాఉండే 'రాయల్ జెల్లీ' మంచి పుష్టికరమైనదని, దానిలో ఎర్గోస్టెరాల్ (ergosterol)తోపాటు బయోటిన్ (biotin), పాంటోథెనిక్ ఆసిడ్ (Pantothenic acid) అధికంగా ఉంటాయని శాస్త్రజ్ఞులు తెలుసుకున్నారు.

(మిగతా 28వ పేజీలో)

"భగవంతుని కూడా తప్పించుకుని తిరుగగలవాడే రాజకీయనాయకుడు."

షేక్‌స్పియర్

# సారీ, నో ఎక్స్యూజ్‌మి

సీతారవిచంద్రన్

ఇంకొకరికి వచ్చిన కవరు నీవు అడ్రస్ చూసుకోకుండా పరధ్యానంగా తొందరలో చింపేస్తావు. తీరా అది నీది కాదని తెలుసుకున్న తరువాత 'సారీ చూసుకోకుండా చింపేసాను' అని ఆకవరును అసలువారికి ఇచ్చేస్తావు. ఇటుప్రక్క అటుప్రక్క చూచుకోకుండా బస్సులోకి ఎక్కి లోపలకు వెడుతూ ప్రక్కనున్నవారి కాలు తొక్కేసి 'సారీ! ఎక్స్యూజ్‌మి' అంటావు. అనుకోకుండా ఏఆదివారంనాడో నీచిరకాల స్నేహితుడు నిన్ను చూడడానికి వస్తూ అరటిపళ్ళు, ఒక బిస్కెట్‌పాకెట్ తీసుకువచ్చి ఇస్తాడు. అవి అందుకుంటూ 'థాంక్స్' అంటావు. ఇంటికి వచ్చిన స్నేహితుడికి నీవు టీ ఇస్తూంటే అతడు వద్దని చెప్పడానికి 'నో ఎక్స్యూజ్‌మి' అంటాడు. దారిలో గబగబ నడుస్తూంటే చేతిలో ఉన్న తాళాలగుత్తి క్రింద పడిపోతుంది. ప్రక్కన నడుస్తూన్న ఒక అసామి తీసి నీకు అందిస్తాడు 'థాంక్యూ' అంటావు.

ఈవిధంగా నిత్యజీవితంలో ఇంట్లోను, బయట, పాలబూత్ దగ్గరో, రేషన్‌షాప్ దగ్గరో, స్టేషన్‌లో టికెట్ కౌంటర్ దగ్గరో వివిధ సందర్భాలలో అనేక అవకాశాలలో సారీ, ఎక్స్యూజ్‌మి, థాంక్యూ ఎన్నిసార్లు వాడతామో! ఈరోజులలో అంతా సారీ, ఎక్స్యూజ్‌మి, నో ఎక్స్యూజ్‌మి, థాంక్యూలతో సరిపెట్టుకోవచ్చు అనే సంస్కృతితోనే మన జీవితాలు గడిచిపోతున్నాయి. చివరికి ప్రతీ రోజూ టివిలో కూడా 'సారీఫర్ ది బ్రేక్' ఎన్నిసార్లు చూస్తున్నామో! జీవితంలో. అసలైన మర్యాదలు, సిసలైన విలువలు మరచిపోతున్నాం.

## బుద్ధుడు-దేవుడు




గౌతమబుద్ధుడు నిరీశ్వరవాది కాదు. దేవుడంటే నమ్మకం లేనివాడు కాదు. బుద్ధుడు సామాన్య నీతిని బోధించాడు. సంఘంలో జీవిస్తూ జనులకు తన భావ స్వరూపాన్ని వివరించాడు. భగవంతుని యందు విశ్వాసాన్ని గురించి ఎన్నిసార్లు ప్రశ్నించినా అది తన బోధనా విషయంకాదని జవాబుచెప్పేవాడు. సామాన్య మానవుల ఆలోచనలకు అందని విషయాలు గురించి అతడు ఎప్పుడూ ప్రసంగించలేదు. బోధించలేదుకూడా. భగవంతుని ప్రసక్తి లేకుండా ఉన్న వాఙ్మయం బౌద్ధవాఙ్మయం ఒక్కటే. అనేక మంది పండితులు దీనిని గురించి, బౌద్ధధర్మము గురించి అడిగినప్పుడు ఒక బిందెడు నీళ్ళు మోయలేని వారు పీపాల కొద్దీ నీళ్ళు మోయుటను గురించి మాట్లాడతారు అని చెప్పేవాడు. అదే విధంగా మానవుని విషయమే పూర్తిగా అవగాహన కానప్పుడు దేవుణ్ణి గురించి ఎలా మాట్లాడగలరు? అని బుద్ధుడు చెప్పేవాడు.

"సజ్జన సాంగత్యం తన్నుతాను తర్కించుకోడానికి ఉపకరిస్తుంది."

ఆంగ్లేయుల సంపర్కం వల్ల, ఇంగ్లీషుభాష నేర్చుకోవడం వల్ల, ఇంగ్లీషు నవలలు చదువుతూండటం వల్ల వారిభాషలో, వారి సాంప్రదాయం ప్రకారం వాడే ఈపదాలను మనం వాడుకుంటున్నాం. ఆంగ్లంలో ఇవి అతిసహజంగా ఉండవచ్చు. కానీ అసలు ఇవి మన భాషకు, మన సాంప్రదాయానికి చెందిన పదాలు కావు. అలవాటు చొప్పున నిత్యవ్యవహారంలో ఈపదాలు వాడుతుంటాం. మడిగట్టుకున్నట్లుగా వీటికి తెలుగుపదాలే వాడదాం అని ప్రయత్నిస్తే సరైన తెలుగు పదాలు తెలియక పశ్చాత్తాపాలు, క్షమాపణలు, కృతజ్ఞతలు, ధన్యవాదాలు మొదలైన సంస్కృత పదాలు వాడితే నాటకాలలో వివిధపాత్రలు మాట్లాడుకున్నట్లు ఉండటమే గాకుండా వినేవారికీ, మనకీ కూడా చాలా హాస్యాస్పదంగానూ, అసహజంగానూ ఉంటుంది.

వాస్తవానికి జీవితంలో అసలైన మర్యాదలు, సిసలైన విలువలు తెలుసుకోలేకపోతున్నాం. ఎదుటివాళ్ళు నిజంగా మనసులో బాధపొంది నప్పుడు మర్యాదగా 'సారీ' అంటారు. దానికి మనం 'సరే' అని సరిపెట్టుకున్నా మనసులో బాధ బాధగానే ఉంటుంది. 'సారీ' అని చెప్పుకోవలసిన అవకాశం లేకుండా ముందే జాగ్రత్త పడితే ఎంతో మేలుకదా! తెలిసో తెలియకో చేసే నోటి తప్పులకు, చే తప్పులకు సారీతో సరిపెట్టుకోకుండా ఉండాలి.

ముఖ్యంగాఎంతసేపూ మనలను గురించి, మన ఇబ్బందులను గురించి తీవ్రతయ పడిపోకూడదు. మెల్లిగా జాగ్రత్తగా మసలుకోవాలి. పరధ్యానం లేకుండా ఎదురుగుండా చూసుకుంటూ మనస్సు నిలబెట్టుకుని ప్రవర్తిస్తూంటే ఇటువంటి అవకాశాలకు తావు ఏర్పడదు. కంటితో చూస్తూ మనస్సుతో తెలుసుకుంటూ మన ప్రయత్నాలు కొనసాగుతూండాలి. మన వల్ల ఇంకొకరికి ఏ ఇబ్బందీ కలుగకుండా ఉండేటట్లు ప్రవర్తించాలి. చిన్న చిన్న పొరపాట్లు జరగడానికి అవకాశం ఇవ్వకూడదు. మాటలాడేటప్పుడు జాగ్రత్త పడాలి. మాటలు జారనీయకూడదు. ఎదుటివారు నీతో మాట్లాడేటప్పుడు జాగ్రత్తగా ప్రతీమాట వినాలి. నిర్లక్ష్యం చేయకుండా నీగౌరవం, ఎదుటివారిగౌరవం కాపాడుకోవాలి. తొందర త్రొటుపాటులేకుండా నిష్కలంకమైన మనస్సుతో ఆలోచిస్తే జీవితాన్ని ఎంతో సక్రమం చేసుకోవచ్చు. అప్పుడే జీవితంలో అసలైన మర్యాదలు, సిసలైన విలువలు పెరుగుతాయి.

●

ప్రపంచం నీరు వంటిది

SRI RAMAKRISHNA

[illegible]

— శ్రీరామకృష్ణ

"పెద్దల ఉపదేశాలు పెట్టని కోటలు."

# టొమాటో ఆదిమస్థానం దక్షిణ అమెరికా

ఎల్.బాలసుబ్రమణియం

టొమాటో సాగుబడికి ఆదిమస్థానం దక్షిణ అమెరికా. మొట్టమొదట దీనిని మెక్సికన్‌లు కృషిచేసి పండించారు. మెక్సికోలో టొమాటోని టొమాటిల్ (Tomatl) అంటారు. ఈపదం నుంచే అనేకభాషలలో ఉపయోగించే 'టొమాటో' ఏర్పడింది అని చెప్పుకోడంలో ఎంత మాత్రం సందేహం లేదు.



టొమాటో టొబాకో (పొగాకు) మరియు పొటాటో (బంగాళదుంప) జాతికి చెందినది. ఇటీవల గత శతాబ్దంలో ఇది 'నైట్‌షేడ్' వంటి విషజాతికి చెందినదని భావించడం చేత దీనిని అసలు వాడేవారు కాదు. టొమాటోలో ఉండే టొమాటైన్ (tomatine) క్షారము అంత విషకరము కాదు. అమితంగా ఉపయోగించినా అపకారం చేయదు. ముఖ్యంగా ఆకులతోను, పచ్చికాయలలోను ఈ టొమాటైన్ క్షారం అధికంగా ఉంటుంది. పచ్చి కాయ బాగా ముగ్గినప్పుడు ఈక్షారము నిరపాయకరమైన యౌగికాలు (compound) గా మారుతుంది.

వినియోగదారులు దీనిని విస్తృతంగా ఉపయోగించినా ఆహార విజ్ఞాన శాస్త్రజ్ఞులైన న్యూట్రిషనిస్టులు దీనిని అంతగా అభిమానించరు.

## ఢిల్లీ దూరదర్శన్ 1965 లో ప్రారంభింపబడింది

భారతదేశపు బ్రాడ్‌కాస్టింగ్ చరిత్రలో ముఖ్యాతి ముఖ్యమైన ఘట్టము - న్యూఢిల్లీలో టివిస్టేషన్ (దూరదర్శన్) 1965 ఆగస్టు 15న ప్రారంభించారు. న్యూఢిల్లీ ఆల్ ఇండియా రేడియో స్టేషన్‌లో ఒక ఆడిటోరియంను టెలివిషన్ స్టూడియోగా మార్చారు.

## భారతదేశంలో వరి దిగుబడి జపాన్ పండించే దాంట్లో సగంకంటే తక్కువ

భారతదేశంలో వరి దిగుబడి జపాన్ పండించే దానిలో 1/2 కన్నా తక్కువ [illegible] 1/3 వంతు [illegible] దానిలో 1/4 వంతు [illegible] (Bio technology) [illegible]

(25వపేజీ తరువాయి)

రాయల్‌జెల్లీలో ఉండే పదార్థాలను కీటకాలకు, ఎలుకలకు పెట్టినప్పుడు అద్భుతమైన ఫలితాలను ఇచ్చాయి. పాంటోథెనిక్ ఆమ్లము పెట్టినప్పుడు సాధారణ ఈగల జీవితకాలం 18 శాతం మరియు నీటిలో నివసించే కీటకాల జీవితం మూడురెట్లు అధికమైంది. ఎలుకలు కొద్దివారాలలో బరువు బాగాపెరిగి చైతన్యవంతమైన పెరుగుదలను ప్రదర్శించాయి.

"నిరాకారుడైన పరమాత్మను సాకారమైన గురువుగా పరిగణించాలి."

టొమాటోలో పుష్టికర ఆహారపదార్థాలు అంత ఎక్కువగా ఉండవు. ముఖ్యమైన పండ్లు, కాయగూరల రకాలలో విటమిను A కి టొమాటో 16 వ స్థానాన్ని పొందుతున్నదని, విటమిను C కి 13వ స్థానాన్ని పొందుతున్నదని ఇటీవల జరిపిన ఒక పరిశీలనలో తేలింది. కంటికి నదురుగా ఆకర్షణీయమైన నిగనిగలాడే ఎర్రని రంగు, కమ్మదనం, రుచివల్ల, అనేక విధాలుగా ఉపయోగపడడం వల్ల దీనికి మంచి ప్రసిద్ధి కలిగింది. ఇది అంత శ్రమలేకుండా సులభంగా సాగుచేయవచ్చు. దీని ప్రసిద్ధికి ఇదో ముఖ్యకారణము.

ఇది మొండిజాతికి చెందినది. ఎటువంటి భూములలోనైనా, ఏవాతావరణంలోనైనా ఇది బాగా పెరుగుతుంది. నీరు నిలవ ఉండకుండా ప్రవహించిపోయే అనుకూలం లేకపోవడం, ఎండ బాగా పడకపోవడం, అత్యధిక, అత్యల్ప వాతావరణాలు మొదలైనవి దీనికి గల కొన్ని సామాన్య సమస్యలు. కాయ బాగా ఏర్పడి గట్టిగా ఉండాలంటే రోజుకి 12 గంటల సూర్యరశ్మి దీనికి అవసరం. ఎక్కువ శీతలంగానీ, మంచు దెబ్బగానీ భరించలేదు.

భారతదేశంలో వ్యాపారరీత్యా దీని సాగుబడి 19 వ శతాబ్దం చివరి భాగంలో ప్రారంభమైంది. దీని సాగుబడికి అనుకూలవంతమైన పరిస్థితులు భారతదేశంలో ప్రతీచోటా ఉంటాయి కాబట్టి ఇక్కడ దీనిని సంవత్సరం పొడుగునా సాగు చేయవచ్చు. మొక్కలలోను, కొమ్మలలోను ప్రొటీనులు అధికంగా ఉంటాయి. కాబట్టి దీనిని పశుగ్రాసంగా ఉపయోగించడానికి పరిశోధనలకు ప్రోత్సాహం కలిగింది.

— 'సిఐఇ.ఎన్ఎఫ్ఎస్' సౌజన్యంతో

●

# నిర్భయత్వాన్ని ప్రసాదించు ప్రభూ!



నన్ను ప్రార్థించనీ
ప్రమాదాల నుంచి రక్షించమని కాదు
ధైర్యసాహసాలతో ఎదుర్కొనేశక్తిని
కలిగించమనే ప్రార్థించనీ
నన్ను కోరుకోనీ
నాకు సంభవించే నా బాధలను పోగొట్టమని కాదు
కష్టనష్టాలను అతితేలికగా భరించగల శక్తిని
కోరుకోనీ
నన్ను ఆశించనీ
నా జీవిత పోరాటంలో మిత్రుల సహకారాన్ని
దిగ్విజయం పొందడానికి నాస్వంతశక్తిని
ఆశించనీ
నన్ను అర్థించనీ
ఆతురతతో భయపడి రక్షణ కోసం కాదు.
నేను నా స్వాతంత్ర్యాన్ని సిద్ధించుకోడానికి శక్తి
సామర్థ్యాలు అర్థించనీ
ఓ ప్రభూ!
నాకు కలిగే దిగ్విజయాలలో మాత్రం నీ కరుణా
కటాక్షాలను స్మరించే పిరికి వానిగా చేయకు.
పరాజయాలలో నీ చేయూత అర్థించనీ.

-రవీంద్రనాథ్ ఠాగూర్

"నమ్మకం లేనప్పుడు మౌనమే మంచిమార్గం."

# విజ్ఞానవేదిక

## ఐన్‌స్టీనియం అంటే?

ఐన్‌స్టీనియం(Einsteinium)ఒక కృత్రిమ రేడియోధార్మిక మూలద్రవ్యం. హైడ్రోజన్ బాంబ్ విస్ఫోటనం వల్ల ఏర్పడినప్పుడు సేకరించిన తుక్కు మరియు రాతిముక్కలలో కాలిఫోర్నియా యూనివర్సిటీ పరిశోధకులు



1952లో దీనిని కనుగొన్నారు. ఆ తరువాత లాబొరేటరీలలో ఈ మూలద్రవ్యం మిక్కిలి తక్కువ పరిమాణంలో ఉత్పాదింపబడింది. ఇది అస్థిరమైనది. ఇతర మూలపదార్థాలుగా మారిపోతుంది. సాపేక్షికసిద్ధాంతాన్ని అభివృద్ధి పరచిన ప్రఖ్యాతవైజ్ఞానిక శాస్త్రజ్ఞుడు ఆల్బర్ట్ ఐన్‌స్టైన్ (1879-1955) గౌరవార్థం దీనికి ఐన్‌స్టీనియం అని పేరుపెట్టబడింది.

* * *

## గలాక్సీ

గలాక్సీ అంతరిక్షంలో బ్రహ్మాండమైన నక్షత్రములరాశి. మన గలాక్సీ - మిల్కీవే గలాక్సీ అంచులో ఉండే సూర్యుడు ఒక నక్షత్రం. మనం స్పష్టంగా తేటగాచూసే నక్షత్రాలు మన గలాక్సీలో మనకు చేరువగా ఉన్నవి. అధునాతనమైన రేడియో మరియు ఆప్టికల్



టెలిస్కోపుల సహాయంతో బిలియన్లకొద్దీ గలాక్సీలను సునిశితంగా చూడవచ్చు. మనకు తెలిసిన గలాక్సీలలో 'నక్షత్రాలు, అతిపల్చని దుమ్ము మరియు గాస్‌తోకూడిన మేఘాలు ఉంటాయి.

ఖగోళ శాస్త్రజ్ఞుల అంచనాప్రకారం ఒక మామూలు గలాక్సీలో సుమారు 100 మిలియను నక్షత్రాలు ఉంటాయి. ఇటువంటి గలాక్సీల కాంతిపుంజాలు ఒక అంచునుంచి ఎదురుగా ఉండే మరో అంచుని దాటడానికి 100,000 సంవత్సరాలు పడుతుంది.

●

### అతిఖచ్చితంగా టైమును చూపే పబ్లిక్ గడియారం

యుఎస్ఏ న్యూయార్క్ నగరంలో గల పబ్లిక్ గడియారం సెకండులో 1/20వ వంతు అతిఖచ్చితంగా టైమును చూపిస్తుంది.

"పాపభావాన్ని అంత మొందించుకోవడం పాపం కంటే ఘోరం."

—పోప్ జాన్ పాల్ II

# వాతావరణాన్ని సూచించే జంతువులు

సహజవాతావరణాన్ని అతి నమ్మకంగా పక్షులు సూచిస్తాయి అనడంలో ఎంతమాత్రం సందేహం లేదు. పక్షులు ఉత్సాహంగా కలవర పడుతూంటే జోరుగా గాలి వీస్తుందని చెప్పుకో వచ్చు. సీమళ్లు ముఖ్యంగా సాయంకాలం పూట వాటి అరుపులతో వాతావరణంలో విషమపరిస్థితులను తెలియజేస్తాయి.

రాత్రి పూట గుడ్లగూబల కూత వాతావరణంలో మంచి, చెడు మార్పులను సూచిస్తుంది. తెల్లవారు ఝామున గూబలు కూస్తే ఆరోజంతా చాలా ఆహ్లాదకరంగా ఉంటుంది.




స్వాలో (Swallow) పక్షులు వాతావరణాన్ని సక్రమంగా చూపించే బరోమీటర్లు (Barometers) అని చెప్పుకోవాలి. ఇవి బాగా ఆకాశంలో క్రిందికి దిగి నిర్భయంగా మొగ్గలు వేస్తూ ఎగురుతూంటే వాన పడుతుందని సూచన.

గబ్బిలాలు కూడా స్వాలో పక్షులులాగే వాతావరణం బాగా ఉన్నప్పుడు బాగా ఎత్తుగా ఎగురుతాయి. వానవచ్చే సూచనలు ఉంటే క్రిందగా ఎగురుతాయి.

ఎక్కడైనా పొలంలో ఉన్నప్పుడు కోళ్లను పరిశీలించండి. ప్రతీ కోడి కూడా వాతావరణంలో సంభవించే మార్పులను అతికచ్చితంగా సూచి స్తుంది. రాత్రివూట కోళ్లుకూస్తే వాన కురుస్తుందన్న మాట.

వాతావరణంలో తేమ ఏర్పడకముందే కోళ్లు ముక్కుతో ఈకలను పీక్కుంటాయి. రెక్కలు



## ద్వీపాలసంవత్సరం

[illegible] 12 ద్వీపాలతో ఆవరించి ఉంది. [illegible] 24 ద్వీపాలతో ([illegible]), [illegible] 52 ద్వీపాలతోను ([illegible]), [illegible] 365 ద్వీపాల ([illegible]) తోను ఆవరించి ఉన్నాయి.

## పదిరెట్లు అధికంగా కృషిచేసాను

*యౌవ్వనంలో ఉండగా నేను చేసిన ప్రతీ పది పనులలో 9 పనులు సిద్ధించలేదని గ్రహించాను. నేను పరాజయం పొందకూడదు అనుకున్నా. వెంటనే 10 రెట్లు అధికంగా కృషి చేయడం ప్రారంభిం చాను.*

— జి.బి.షా

"నిజం తెలుసుకోకుండా విశ్వసించడం మానవుడు ఆచరించే మహాపాపం."

—థామస్ హెచ్.హక్స్లే

బాగా విప్పుకుంటాయి. వాన కురిసేటప్పుడు దగ్గర ఆశ్రయం చూసుకుంటాయి.

ఆడబాతులు వర్షానికి ముందు రెక్కలు సరిచేసుకుంటాయని, మగబాతులు వర్షం వచ్చేటప్పుడు అరుస్తాయని సుమారు 400 సంవత్సరాలకు పూర్వం సర్‌ఫ్రాన్సిస్ బేకన్ చెప్పాడు. కొంగలు నీటితలానికి దగ్గరగా ఎగురుతూంటే వర్షం వస్తుందని, ఎత్తుగా ఆకాశంలో ఎగురుతూంటే గాలి బాగా వీస్తుందని, గట్టుమీదికి చేరితే గాలివాన వస్తుందని తెలుస్తుంది.

చెమ్మగా ఉన్న రోజున పక్షులు నిశ్శబ్దంగా ఉంటాయి. వర్షం బాగా కురుస్తూన్నప్పుడు



పిచ్చికలు కిలకిల లాడుతూంటే వాన వెలుస్తుంది. కాకులు గడ్డి మైదానాలలో దిగుతాయి.

రాఖిన్ అనే పక్షి అతి ఖచ్చితంగా వాతావరణాన్ని సూచిస్తుంది. వాన కురవబోతుంటే మంచి ఆశ్రయాన్ని రక్షణ కోసం వెతుక్కుంటాయి.

కొన్ని జంతువులను పరిశీలించి కూడా వాతావరణంలో మార్పులను తెలుసుకోవచ్చు. గాలిబాగా లేనప్పుడు జంతువులు చాలా విచిత్రంగా ప్రవర్తిస్తాయి. ఎప్పుడు సురక్షితమైన ప్రదేశం చేరాలో వాటికి తెలుసు. గాలీ, వాన వస్తూందంటే పిల్లులు అసలుకళ్లు మూయవు. నిద్రపోవు. ఉరుములు, పిడుగులు ఉరుముతూంటే వాటికి పిచ్చి ఎక్కినట్లు ఉంటుంది. చెవులు వెనక్కి తిరిగిపోతాయి. తోక ఎత్తి వెంట్రుకలు నిక్కబొడుచుకుని ఉంటాయి. అప్పుడు దాని వెంట్రుకలు పూర్తిగా విద్యుచ్ఛక్తితో ఉంటాయి. అప్పుడప్పుడు స్పార్కులతో, మిణుగు మిణుగుమని వెలుతురు కనిపిస్తుంది. వాన వచ్చేముందు




కుక్కలు చాలా హడావిడిగా ఉంటాయి. ఒక చోటనిశ్చింతగా కూర్చోలేవు. కాలిగోళ్లతో పెరుక్కుంటాయి. లేక గడ్డిని తింటాయి.

**షార్జా క్రికెట్ అటస్థలంలో 10,000 కార్లు నిలపడానికి స్థలావకాశం**

యు.ఎ.ఇ.లో షార్జా క్రికెట్ ఆట స్థలానికి ప్రతి రోజూ 10,000 గాలనుల నీరు వినియోగమవుతుంది. అక్కడ 10,000 కార్లు నిలపడానికి స్థలం ఉంది.

"ఏదేశంలో ఉన్నా ఎక్కడ ఉన్నా మానవుడు మానవుడే, భాషమాత్రం మారుతుంది."

హెర్మెస్

జంతువులలో పందులు వాతావరణాన్ని నక్రమంగా సూచిస్తాయి. చిన్నచిన్న గ్రామాలలో పందులు గాలిని ముందుగానే సూచిస్తాయి అంటారు. వానవచ్చేముందు ఇవి నిలకడగా ఉండలేవు. అదేపనిగా తిండిపోతుల్లా తింటాయి. నేలను త్రవ్వుతాయి. చెవులు ఆడించుకుంటూ మూలుగుతూ అటుఇటూ చూస్తూ పరుగెత్తుతాయి.



గాలి బాగా లేదన్నప్పుడు ఆవులు కూడా అసాధారణంగా ప్రవర్తిస్తాయి. తోక ఆడిస్తాయి. వింతగా అరుస్తాయి. పశువులు నిర్భయంగా, నిశ్చింతగా చూస్తూ నుంచుంటే బాగా ఎండ కాస్తుందని తెలుస్తుంది. పడుకుంటే వానకు సూచన.

ఎప్పుడు బాగా మంచు పడుతుందో గొర్రెలకు బాగా తెలుసునని గొల్లవాళ్లంటారు. వానకురవ బోతుంటే గొర్రెలు గోడలప్రక్క, కంచెలప్రక్క తలదాచుకుంటాయి. వానఎప్పుడు కురుస్తుందో కుందేళ్లకు కూడా తెలుస్తుంది. వానకురిసేటప్పుడు కుందేళ్లు చాలా భయ పడిపోతాయి. కులాసాగా గంతులు వేస్తూంటే వాతావరణం బాగుం టుందని సూచన. గాలివాన వచ్చే ముందు మంచి ఆశ్రయంలో ముడుచుకుని కూర్చుం టాయి.

ఉడుతలకు వాతావరణం గురించి బాగా తెలుసు. వేసవిలో ఇవి గింజలు, కాయలు బాగా కూడబెడితే శీతాకాలం చాలా తీవ్రంగా ఉంటుందని తెలుస్తుంది. పరిసర వాతావరణానికి అనుకూలంగానూ, సౌకర్యంగానూ ఇవి గూళ్లను నిర్మించుకుంటాయి.

●

## ఆరాల్ సముద్రం తరిగి పోతూంది

*సోవియట్ యూనియన్‌లో ఆరాల్ సముద్రం వైశాల్యాన్ని బట్టి ప్రపంచంలో నాల్గవ మిక్కిలి పెద్ద ఉప్పునీటిసరస్సు. ఇది ఇప్పుడు తీసిపోతూంది. 1960 సంవత్సరం నుండి దీని నీటిమట్టం 13 మీటర్లు దిగిపోయింది. వైశాల్యం 40 శాతం తగ్గి పోయింది. దీనిఫలితంగా ఏర్పడిన 27,000 చ.కి.మీ.ల వైశాల్యప్రదేశంలో ఏర్పడిన ఉప్పు ఇసుక చుట్టుప్రక్కలపొలాలలో చేరి భూమిలో ఉప్పు అధికం అవడంవల్ల మత్స్యపరిశ్రమ అడుగంటి పోయింది. వగటు వేసవి ఉష్ణోగ్రత 3 డిగ్రీల సెల్షియస్ పెరిగింది. శీతాకాలపు ఉష్ణోగ్రత 1.5 డిగ్రీల సెల్షియస్ పడిపోయింది.*

*ముఖ్యంగా దీనిలోకి ప్రవహించే అము డార్యా (Amu Darya) మరియు సిర్ డార్యా (Syr Darya) నదుల నీరు ఇందులో చేరనందువల్ల ఆరాల్ సముద్రానికి ఈసమస్య ఏర్పడింది. ఈనదులనీరు పూర్తిగా వ్యవసాయానికి వినియోగించ జేసు కుంటున్నారు.*

*-'పిఐఐ.ఎన్ఎఫ్ఎస్' సౌజన్యంతో*

"వినేవారు లేనిచోట చెవులు కొరికేవారు ఉండరు."

# ధీశక్తిం

ధీశక్తి లేక మానసికసామర్థ్యం చాలామందికి ఒకక్రమపద్ధతిలోహెచ్చుతూంటుంది, తగ్గుతూంటుంది. సాధారణంగా ఇది:

ప్రొద్దుట: 8గంటలకు 105శాతం, 10గంటలకు 102శాతం.
మధ్యాహ్నం: ఒంటిగంటకు 101శాతం, నాలుగు గంటలకు 96శాతం.



సాయంకాలం: 8 గంటలకు 98 శాతం, 10 గంటలకు 97 శాతం

ఈవిధంగాఒకరోజులో మానసిక సామర్థ్యంలో కలుగుతూన్న మార్పులను వైద్యులు అనుకూలవంతం చేసుకున్నారు. ముందు ఏర్పాటు చేసుకున్న శస్త్రచికిత్సలు ప్రొద్దుటిపూటే చేస్తారు. రోజు ప్రారంభంలో ప్రొద్దున్న బుద్ధి చాలా తేటగా, స్పష్టంగా ఉంటుంది. చేతులు స్థిరంగా, నిలకడగా పనిచేస్తాయి. అంతేగాకుండా రోగికి ప్రొద్దుటిపూట చేతనశక్తి అధికంగా ఉంటుంది. ప్రొద్దున్న చదువుకునేవారు చాలామంది తెలివితేటలను అధికం చేసుకున్నారని వారి జీవిత చరిత్రలవల్ల తెలుస్తూంది.

చాలామందికి ప్రొద్దున్న పనులు చేసుకోడం ఒక పెద్దసమస్యే. పొలాలలోపనిచేసే వారైనా, పెద్ద కర్మాగారాలలో ఉద్యోగాలుచేసే వారైనా ప్రొద్దుటే ఎంతో లాభం పొందగలరు. మూడురోజులు వరుసగా ప్రొద్దున్నలేస్తే కాలంలో ఒకరోజు కలిసివస్తుంది.

థామస్ జెఫర్సన్ 'నేనెప్పుడు నాకంటే ముందుగా సూర్యుణ్ణి లేవనియ్యను' అనేవాడు. ఇప్పటి టివిలు, అర్ధరాత్రి సినీమాలు మరి ఆనాడు లేవు.

—'సన్‌షైన్ మాగజైన్' సౌజన్యంతో

## అపూర్వ విషయాలు

### డామోక్లెస్ ఖడ్గము

[illegible]

### 13 సంవత్సరాలపాటు నిరంతర రిలే భజన

*గుజరాత్ జునాఘడ్‌లో బాలాజీ సంకీర్తన మందిర్ సభ్యులు 1964లో నిరంతరంగా రిలే భజన ప్రారంభించారు. 13 సం.ల దీర్ఘకాలం తరువాత దీనిని పూర్తిచేసారు. అనేకమంది భక్తులు అందులో పాల్గొని శ్రీరామచంద్రమూర్తి భజన చేసారు.*

"రూపురేఖలు మార్చుకోలేకపోయినా మాటతీరు మార్చుకోవచ్చు."

# అబ్రహాంలింకన్ - గడ్డం

అబ్రహాంలింకన్ అమెరికా 16వ అధ్యక్షుడు. ఇతడిపేరు వినడంతోటే మనకి అతడి గడ్డం స్ఫురణకు రాకమానదు. లింకన్ అపురూపమైన ఈ గడ్డాన్ని పెంచుకోడానికి 'గ్రేస్ బెడెల్' అనే ఒక చిన్నపిల్లే ముఖ్య కారణం.



అమెరికా అధ్యక్షుడుగా లింకన్ పోటీచేస్తున్న రోజులవి. తండ్రి కొనుక్కొచ్చిన ఒక చిత్రాన్ని బెడెల్ చూసింది. అది అబ్రహాంలింకన్ ఫోటో. ఆఫోటోలో లింకన్ బొమ్మ మామూలుగా లేదు. ముఖంఅంతా ముడతలుముడతలుగా ఉంది. తల బట్టతలగా ఉంది. జీవం ఒలికే ఆ చిత్రంలో బెడెల్‌కి ఏదో తక్కువయినట్లు కనిపించింది. చిత్రంలో లింకన్‌కి గడ్డం లేదు.

వెంటనే బెడెల్ ధైర్యంతో లింకన్‌కి ఒక ఉత్తరం వ్రాసింది. అందులో లింకన్ గడ్డం పెంచితే అందంగా కనిపించడమేకాకుండా తన ఇంట్లో వోట్లన్నీ అతడికేపడేటట్లు చూస్తానని మాట ఇచ్చింది.

1861 ఫిబ్రవరి 16వ, 16వ అధ్యక్షుడుగా ఎన్నుకోబడిన అబ్రహాంలింకన్ వైట్ హౌస్‌కి వెడుతున్నాడని, దారిలో ఆయనరైలు వెస్ట్‌ఫీల్డ్ దగ్గర ఆగుతుందని వార్తవచ్చింది. లక్షలాది జనంతోపాటు బెడెల్ కుటుంబంకూడా స్టేషనుకు వెళ్లింది, లింకన్‌ని చూడడానికి.

రైలు వచ్చి ఆగింది. గిలగిలా జనం మూగిపోయారు. బెడెల్‌కి ఏమీ కనిపించడంలేదు. నిక్కినిక్కి చూస్తూంది. లింకన్ క్రిందికి దిగి నిలబడ్డాడు. బెడెల్‌కి వినిపిస్తూంది-లింకన్ మాట్లాడుతున్నాడు.

'సోదర సోదరీమణులారా! నేను ఉపన్యాసం చేయడానికి రాలేదు. ఉపన్యాసానికి నాకు అవధిలేదు. మిమ్మల్ని అందర్నీ ఒక్కసారి చూడాలని మీముందు నిలబడ్డాను. మీరంతా నాకు అండగా నిలుస్తారని తలుస్తాను' అన్నాడు.

## పంజాబ్‌లో గోధుమ పుష్కలంగా పండుతుంది

పంజాబ్‌లో గోధుమ ఉత్పత్తి అత్యధికం. ఉత్తర ప్రదేశ్‌లో హెక్టేరుకి 1992 కిలోగ్రాములు, మధ్యప్రదేశ్‌లో హెక్టేరుకి 1146 కిలోగ్రాములు, మరియు అఖిల భారత సగటు హెక్టేరుకి 2082 కిలోగ్రాముల గోధుమ ఉత్పాదన జరిగితే పంజాబ్‌లో హెక్టేరుకి [illegible] కిలోగ్రాముల పండుతుంది.

— [illegible]

"తిరోగాములు, స్థిరులు, పురోగాములు అని మానవలోకం ముఖ్యంగా మూడు రకాలు-ఉత్తములు, మధ్యములు, నీచులు."

అందరూ కరతాళధ్వనులు చేసారు. తమ అంగీకారాన్ని తెలియజేసారు. 'ఈ ఊళ్లో నాకో స్నేహితురాలు ఉంది. ఆ అమ్మాయి ఇక్కడ ఉంటే ఒకసారి పలకరించాలని ఉంది. ఆ అమ్మాయిపేరు గ్రేస్ బెడెల్' అని లింకన్ తిరిగి చెప్పాడు.



తండ్రి గ్రేస్ బెడెల్ చేయిపట్టుకుని లింకన్ ఎదుటికి తీసుకు వెళ్లాడు. లింకన్ అమాంతం రెండుచేతులతో గ్రేస్‌ను ఎత్తుకుని ముద్దు పెట్టుకున్నాడు. ఆయన చెంపలమీద నల్లని గరుకు గడ్డం పెరిగింది. గడ్డం గుచ్చుకుని గ్రేస్ లేత చెక్కిళ్లు గీసుకు పోయాయి.

'చూసావా గ్రేస్ నీకోసమే పెంచాను' అని లింకన్ రైలు ఎక్కాడు. రైలు కదిలి వెళ్లి పోయింది. గ్రేస్ చెవులలో 'నాస్నేహితురాలు' అనేమాటలు మారుమ్రోగుతున్నాయి.

ఇప్పటికీ 'ఇలినాయి' స్ప్రింగ్‌ఫీల్డ్‌లో అబ్రహాం లింకన్ ఇంట్లో గదిగోడమీద ఇంకాచిన్న కాగితం కనిపిస్తుంది. దానిమీద 'అర్యా! నేను పదకొండేళ్లపిల్లను'...అదే గ్రేస్ ఉత్తరం.

## మానవుడు వృద్ధుడవడానికి ఎప్పుడు ప్రారంభిస్తాడు?

సరిగ్గా మానవుడు ఎప్పుడు వృద్ధుడవుతాడో చెప్పగలను అనుకుంటాను. ఏకాంతంలో ఆత్మపరీక్ష చేసుకున్నప్పుడు, ముందు వచ్చేవిగాక ఎప్పుడో పూర్వం జరిగిపోయిన వాటిని గురించి యోచనలు, పర్యాలోచనలు బయలు దేరిన క్షణంనుంచీ వృద్ధాప్యం ఏర్పడిందనాలి. ఆశయాలతో కాకుండా మానవుని మనస్సులో పూర్వజ్ఞాపికలు, సంస్మరణలు ప్రారంభమైతే వృద్ధాప్యం వచ్చేసింది అని చెప్పాలి. అప్పుడే యౌవ్వనం మళ్ళింది అనిచెప్పవలసి వస్తుంది.

-విలియం లైయన్ ఫెల్ప్సు

## సుఖం సంతృప్తి రెండూ ఉన్నాయి

సుప్రసిద్ధ పార్శీకవి షేక్‌సాది ఒకనాడు ఎండి పోయి దుమ్ము చెలరేగుతున్న దారిలో ఒక మనిషి రాతిబండలను పగులకొడుతూంటే చూసాడు. అవ్యక్తి అలసిపోయి కష్టపడు తూన్నట్టు కనిపించాడు. ఇంకా కొంత దూరం ప్రయాణంచేసిన తరువాత మరోమనిషి అదేవిధంగా రాతి బండలను పగుల గొడుతూన్నట్టు కనిపించాడు. ఇతడు ఆనందంతో సంతృప్తిగా ఉన్నట్టు కనిపించాడు. అడిగితే మొదటి మనిషి అమ్ముకోడానికి ఇటుకలను తయారు చేస్తున్నాడని, రెండవవాడు మసీదు నిర్మించాలనే కోరిక సిద్ధించుకోడానికి శ్రమపడుతున్నా డని తెలిసింది.

"తాను చెప్పేదానిలో తనకు విశ్వాసం ఉండదు కాబట్టి ఇంకొకరు విశ్వసిస్తే ఆశ్చర్యపడతాడు రాజకీయవేత్త."

# రంగుల రహస్యం

(కర్టెన్లకు, బట్టలకు, ఇంటిలోపల అలంకరణలకు)

తెలుపు: ఒక విధమైన చల్లదనాన్నీ తేలిక దనాన్నీ కలిగిస్తుంది.

నమపు: ప్రసన్నతతో వెచ్చదనాన్నీ తేలికతనాన్నీ ఇస్తుంది. వైశాల్యం పెరిగినట్టు ఉంటుంది. వాడివేగం అధికమవుతుంది. మెదడుచురుకుగా పనిచేస్తుంది. కానీ కొట్టవచ్చినట్టుగా ఉంటుంది.

వారింజ: మంచి ఆహ్లాదకరంగా ఉంటుంది. వాడి శీఘ్రంగా కొట్టుకుంటుంది. ఒకరకం వెచ్చదనాన్ని కలిగిస్తుంది.

ఎరుపు: మిక్కిలి వెచ్చదనం కలిగించేరంగు. ఉత్తేజకరంగా ఉంటుంది. కానీ చాలాసేపు ఈ రంగులో ఉంటే అలసట అనిపించి వాడివేగంగా కొట్టుకుంటుంది.

రక్తవర్ణము: మంచి భావోద్రేకం కలిగిస్తుంది. వెచ్చగా ఉంటుంది.

ఊదా: అలసిపోయినట్టు అనిపిస్తుంది. ఎక్కువ భారంగా ఉంటుంది. బిర్రబిగుసుకి పోయి వైశాల్యం పెరిగినట్టు అనిపిస్తుంది.

ముదురునీలం: మనస్సుకి శాంతి ఉంటుంది. కానీ విచారం కలిగిస్తుంది. నీలంరంగు వేయ బడిన గది చల్లగాఉన్నా ఇరుకుగా కనిపిస్తుంది.

ఆకుపచ్చ: చల్లగా హాయిగా ఉంటుంది. ప్రశాంతత ఏర్పడుతుంది. కళ్లమీద అంత ఒత్తిడి ఉండదు. సామాన్యంగా దృష్టికి తీక్షణత కలిగిస్తుంది. రక్తపు ఒత్తిడిని సమ స్థాయిలో ఉంచుతుంది.

లేత నీలం: ఈ రంగుతో గది చల్లగా ఉంటుంది. విశాల ప్రదేశంలో ఉన్నట్టు అనిపిస్తుంది. ప్రశాంతంగా ఉంటుంది.

నలుపు: పటుత్వాన్ని తగ్గిస్తుంది. విచారకరంగా ఉంటుంది. అధికభారం అనిపిస్తుంది.

ఇటుకరంగు: వెచ్చగా ఉంటుంది. మనోనిబ్బరం, సమదృష్టి ఏర్పడుతుంది.

బూడిదవర్ణం: చల్లగాఉన్నా మందకొడిగా ఉంటుంది. ఒక విధమైన ఉదాసీనభావం ఏర్పడుతుంది.

ఇటుకబూడిదవర్ణం: మానసిక ఉద్రేకం కలిగిస్తుంది. మనస్సులో ఆందోళన కలిగిస్తుంది.

నీలం తెలుపు: హాయిగా చల్లగా ఉంటుంది. ప్రశాంతంగా ఉంటుంది.

—'మ్యాటనిక్' సౌజన్యంతో

## ఊజోన్ అంటే



[illegible]

"మానవుడు పులిని చంపితే అదివేట. పులి మానవుణ్ణి చంపితే అది క్రౌర్యం."

—జార్జి బెర్నార్డ్ షా

# ప్రపంచంలో మిక్కిలి ధనవంతుడైన రాజు

ఒకటిన్నర శతాబ్దానికి ముందు కరేబియన్ సముద్రంలో హైటీని హెన్రీ క్రిస్టొఫె అనే నల్లజాతికి చెందిన రాజు (Black King) సర్వతంత్ర స్వతంత్రుడుగా రాజ్యం పాలించాడు. ఇతడు ఒక బానిస కుటుంబంలో జన్మించాడు. జీవిత ప్రప్రథమదశలో ఇతడు కటిక దారిద్ర్యాన్ని అనుభవించాడు. 24వ సం.రం. వయస్సులో ఒక గొప్పవిప్లవీరుడుగా మారి హైటీలో చెరకు తోటలనుంచి ఫ్రెంచి అధికారులను తరిమి వేయుటకు నీగ్రో బానిసలకు సహకరించాడు.

హైటీలో బానిసలు ఇతడి నాయకత్వంతో ఫ్రెంచిసైనికులను తరిమివేసి స్వాతంత్ర్యాన్ని ప్రకటించుకున్నారు. జనవరి 1, 1804న హైటీ 'బ్లాక్‌రిపబ్లిక్' గా రూపొందింది. స్వాతంత్ర్యం సిద్ధించిన తరువాత క్రిస్టొఫె సైన్యాధికారిగా నియమించబడ్డాడు. కొన్ని సంవత్సరాల తరువాత ఇతడు ప్రజలలో అంతఃకలహములను లేవదీసి ప్రజాయుద్ధంలో విజయాన్ని పొంది హైటీ రాజుగా ప్రకటించుకున్నాడు.

సర్వతంత్ర స్వతంత్రయోధుడైన క్రిస్టొఫె తన కీర్తి ప్రఖ్యాతులకు నిర్బంధప్రజాసహాయాన్ని పొందాడు. మాజీ బానిస ఒక ప్రపంచ ప్రఖ్యాతి పొందిన రాజుగా, మిక్కిలి ధనవంతుడుగా మారాడు. ఇతడు ఒక బ్రహ్మాండమైన రాజ గృహాన్ని నిర్మించి అనేక అపురూపమైన శిల్పములు, చిత్రములు, పింగాణీవస్తువులు, జలతారు అలంకార వస్తువులు, బంగారు పడక, ఇంకా ఇతర ఉపకరణములతో దానిని సిద్ధపరచాడు. ఒకప్పుడు ఇంట్లో పనిగత్తెగా ఉన్న మేరీయా లూసీని రాణిగా చేసాడు.

ఆజానుబాహుడైన రాజు మిక్కిలి బలవంతుడై దురహంకారంతో ప్రవర్తించే వాడు. ఇతడియందలి ఒక అపురూపమైన సమ్మోహకశక్తికి ప్రజలు మోహింపబడేవారు. సైనికులు అందరూ ఇతడి చెప్పుచేతలలో ఉండేవారు. కానీ రాజుశక్తి తగ్గగా ఇతడి అనుచరులు ఇతడిని విడిచిపెట్టారు. చివరకు 1820లో తనపతనానికి కుట్రపన్నుతున్నారని తెలుసుకున్నాడు. వృద్ధుడైన చక్రవర్తి దేదీప్యమానమైన దుస్తులను ధరించి ఒకగదిలో తలుపులు మూసుకుని కూర్చున్నాడు. రివాల్వరులో ఒక బంగారు గుండుని అమర్చి తలపై పేల్చుకున్నాడు!

●

## షేక్స్పియర్ మరియు సెర్వాంటెస్ ఒకే రోజున మరణించారు




ప్రపంచంలో ఇద్దరు సుప్రసిద్ధ రచయితలు విలియం షేక్స్పియర్ మరియు మిగుయెల్ డి సెర్వాంటెస్ (డాన్ క్విక్సోట్ రచయిత) ఇద్దరు యాదృచ్ఛికంగా ఏప్రిల్ 23, 1616న ఒకే రోజున మరణించారు.

"శాసనాలు పెరుగుతున్నకొద్దీ
వాటిని ఉల్లంఘించడమూ అధికమవుతుంది."
—హేవ్‌లక్ ఎల్లిస్

# తపాలా సమాచారం

## ప్రపంచంలో మొట్టమొదటి స్టాంపు 1840లో విడుదలైంది

ప్రపంచంలో మొట్టమొదటి స్టాంపు 'పెన్నీ బ్లాక్' (Penny Black)ను బ్రిటన్‌లో 'మెసర్స్ పార్కిన్స్ బేకన్ అండ్ కో' వారు 1840, మే 6న విడుదల చేసారు.

* * *




## యుఎస్ఎ లో అధికార సమ్మతమైన స్టాంపులు 1847లో మొట్ట మొదట విడుదల చేసారు

యుఎస్ఎ లో మొట్ట మొదటి అధికార సమ్మతమైన స్టాంపులను ఆగస్టు 1847లో విడుదల చేసారు. వాటిమీద బెంజమిన్ ఫ్రాంక్లిన్, జార్జి వాషింగ్‌టన్ బొమ్మలు ఉన్నాయి. 1847 కంటే ముందు గానే యు ఎస్ ఎ లో కొన్ని కొన్ని పట్టణాలలో పోస్టు మాస్టర్లు తమ స్వంత స్టాంపులను జారీ చేసారు.

* * *

## బ్రెజిల్ స్వంత స్టాంపును 1843లో విడుదల చేసింది

దక్షిణ అమెరికాలో బ్రెజిల్ మొట్టమొదటి స్టాంపును 1843లో విడుదల చేసింది. వెంటనే స్విట్జర్లాండ్‌లో జ్యూరిచ్ మరియు జెనీవా తమ స్టాంపులను విడుదల చేసాయి.

●

## చంద్రమండలంలోకి యాత్ర గురించి జూల్స్‌వెర్నెస్ ఏనాడో చెప్పాడు

జూల్స్‌వెర్నెస్ విజ్ఞానసంబంధమైన కాల్పనిక నవలారచయిత. ఇతడు 1865 లో రచించిన 'రౌండ్ ది మూన్' అనేగ్రంథం వైజ్ఞానిక అద్భుతాలతో ఉంటుంది. భవిష్యత్తులో ఒకరోజున ముగ్గురు యోధులతో చంద్రమండలంలో యాత్ర జరుగు తుందని దీంట్లో సూచించాడు. వెర్నెస్ తనగ్రంథంలో వివరించిన అంతరిక్ష విమానం భారం 19,250 పౌండ్లు. ఈనాడు ఉపయోగించిన అపోలో అంతరిక్షవిమానం సుమారు 12,250 పౌండ్ల భారం ఉంది.

## గేదెలు నీటిలో బాగా ఈదుతాయి

[illegible]

—[illegible]

"చిత్త చిత్తగిస్తే చిక్కులు తీరతాయి."

# కలంస్నేహితులు

[ మీపేరు, వయస్సు, చిరునామా, హాబీలు ఈశీర్షిక క్రింద ప్రచురింపబడాలంటే తగిన వివరాలతో సహా రూ.5/-లు మనియార్డరు ద్వారా పంపండి. -సంపాదకుడు.]

1. డి.కే.మూర్తి, 23/517, ఫతేఖాన్‌పేట, నెల్లూరు- 524 003.
   ఇండియన్ స్టాంపుల సేకరణ.
2. ఇండ్ల సూర్యప్రకాశరావ్, IDM, ఐసిఎఫ్/షెల్, మద్రాసు - 600 038.
   టివి వార్తలు వినడం, చదరంగం ఆడటం, సెలవులలో బీచికి వెళ్ళడం.
3. ఎస్.మురళీకృష్ణ, (ACS), 23 నం.లు., 17, జి.ఎ.కె.వీధి మీనామేన్షన్, రాయపేట హైరోడ్, మద్రాసు - 14.
   కలంస్నేహం, నవలలు చదవడం, సంగీతం.
4. ఎమ్.ఎస్.ఆర్.కృష్ణ, (సిఏ), 23 నం.లు, మీనామేన్షన్, రూమ్‌నెం 7, 17, జి.ఎ.కె.వీధి, రాయపేట, మద్రాసు - 14.
   కలంస్నేహం, పుస్తకపఠనం, చిత్రలేఖనం.
5. ఎమ్.మంగయ్య (బి.ఎ), 20 నం.లు., ఇం.నెం. 4-7-166/1, ప్రకాష్‌నగర్, వెంకట గిరి రోడ్, ఖమ్మం - 507 003.
   కలంస్నేహం, నవలలు చదవడం.

●

## వెండితో కప్పబడిన బాట

యుఎస్ఏ కొలరాడో సెంట్రల్ నగరంలో ప్రెసిడెంట్ గ్రాంటు 1872లో తన హోటల్‌కి వెళ్ళే బాట మొత్తాన్ని వెండితో కప్పబడింది.

## నేను పుస్తకం చదువుతాను



SWAMI VIVEKANANDA

స్వామీ వివేకానందులు ఒకసారి ఒక అమెరికన్ లైబ్రరీకి వెళ్లి ఒక పుస్తకాన్ని అడిగారు. లైబ్రేరియను ఆ పుస్తకం వెదికి వెదికి ఇచ్చాడు. స్వామీజీ కొద్ది సేపటిలోనే ఆ పుస్తకాన్ని తిరిగి ఇచ్చేసారు. అప్పుడు లైబ్రేరియన్ 'నా టైము అంతా వ్యర్థం చేసావు. నీవీ పుస్తకం చదవలేదు' అన్నాడు.

వివేకానందులు 'నేను చదివాను. ఈ గ్రంథంలో ఏపుటలోనైనా విషయాన్ని గురించి అడుగు' అన్నారు. లైబ్రేరియన్ అడిగాడు. వెంటనే వివేకానందులు జవాబు చెప్పారు. మిక్కిలి ఆశ్చర్యంతో 'ఇంత పెద్దగ్రంథం అంత త్వరగా ఎలా చదివారు?' అని లైబ్రేరియన్ అడిగాడు. దానికి వివేకానందులు 'ఓ మిత్రమా! అందరూ నీవంటి మూర్ఖులు కాదు. కొందరు మాటమాట చదువుతారు; కొందరు ప్రతీ వాక్యం చదువుతారు. కొందరు ప్రతీ పారా చదువుతారు. ఇంకా కొందరు పుటపుట చదువుతారు. నేను ప్రతీ పుస్తకం చదువుతాను' అన్నారు.

"మానవులు పుణ్యపురుషులైతే శాసనాలు అనవసరం. భ్రష్టులైతే చట్టాలను ఉల్లంఘిస్తారు."

# సుప్రసిద్ధ శాస్త్రజ్ఞులు

## డా.ఎమ్.ఎస్.స్వామినాథన్

తమిళనాడు కుంభకోణంలో 1925 ఆగస్టు 7న జన్మించిన స్వామినాథన్ విద్య ట్రావెన్కూర్ మరియు మద్రాసు యూనివర్శిటీలలో ముగిసింది. 1947లో కోయంబత్తూరు వ్యవసాయ కళాశాలలో వ్యవసాయ శాస్త్రంలో బి.యస్సి., డిగ్రీని పొందారు. తరువాత వీరు యునైటెడ్


Dr. M.S. SWAMINATHAN

కింగ్డమ్కు వెళ్లి అక్కడ కేంబ్రిడ్జి యూనివర్సిటీలోని స్కూల్ ఆఫ్ అగ్రికల్చర్లో 1952లో జన్యుశాస్త్రంలో Ph.Dని పొందారు. అనాటినుండి వీరు భారతదేశము, జర్మనీ, నెదర్లాండ్స్, ఇటలీ, యునైటెడ్ స్టేట్స్, ఫిలిప్పైన్స్ మరియు థాయ్లాండ్లలో గల 31 యూనివర్శిటీల నుండి ఆనరరీ డాక్టరేట్ పదవులను పొందారు. 1952-53 సంవత్సరకాలంలో వీరు యునైటెడ్ స్టేట్స్ విస్కాన్సిన్ యూనివర్శిటీలో జన్యుశాస్త్రవిభాగంలో సహాయ పరిశోధకులుగా ఉన్నారు

1954 మరియు 1972 సంవత్సరాల మధ్య వీరు కటక్ సెంట్రల్ రైస్ రీసెర్చి ఇన్స్టిట్యూట్లోను మరియు న్యూఢిల్లీలోని ఇండియన్ అగ్రికల్చురల్ రీసెర్చి ఇన్స్టిట్యూట్ (IARI) లోను ఉపాధ్యాయులుగానూ, పరిశోధకులుగానూ, పరిశోధనా వ్యవహారకర్తగానూ పనిచేసారు. న్యూఢిల్లీ IARIలో పని చేసిన దీర్ఘకాలవ్యవధిలో వీరు గోధుమ, వరి మరియు జొన్నపైరుల మీద పరిశోధనలు కావించారు.

1972-80 సంవత్సరాల మధ్య వీరు డిపార్ట్మెంట్ ఆఫ్ అగ్రికల్చురల్ రీసెర్చి అండ్ ఎడ్యుకేషన్ మరియు మినిస్ట్రీ ఆఫ్ అగ్రికల్చర్ అండ్ ఇరిగేషన్లలో పేరుప్రతిష్ఠలతో అనేక ముఖ్యపదవులను అధిష్ఠించారు. 1980-82 సంవత్సరాల మధ్య ప్లానింగ్ కమిషన్లో వ్యవసాయ మరియు గ్రామీణాభివృద్ధికి ఇన్చార్జి సభ్యులుగా ఎన్నుకోబడ్డారు. ఏప్రిల్ 1982 నుండి జనవరి 1988 వరకు ఫిలిప్పైన్స్ లోని లాగునాలో లాస్ బేనాస్లో ఇంటర్నేషనల్ రైస్ రీసెర్చి ఇన్స్టిట్యూట్ డైరక్టరు జనరల్ పదవిని నిర్వహించారు.

వీరు భారతదేశంలో పొట్టి రకం గోధుమను ప్రవేశపెట్టి అధిక దిగుబడిరకాల ప్రవృద్ధి కార్యక్రమాలను ప్రారంభించారు. ఆకస్మిక పరివర్తనలతోను, ఇతర సాంకేతిక ఉపాయాలతోనూ గోధుమ మరియు వరిలో ప్రోటీనుల విశిష్టతను మరియు పరిమాణాన్ని అభివృద్ధి పరచవచ్చునే వీరి ప్రత్యక్ష ప్రదర్శన అనేకమంది ఆహార సాంకేతిక నిపుణుల (ఫుడ్ టెక్నాలజిస్టు) దృష్టిని ఆకర్షించింది. రేడియేషన్ పరీక్ష ప్రభావం మరియు అణుశక్తి ప్రభావం వల్ల

---

"మనిషికి చిరునవ్వు పుష్పానికి సూర్యరశ్మి వంటిది."
—జోసెఫ్ ఎడిసన్

ఫలసాయాభివృద్ధి కలిగించడానికి వీరేమార్గ దర్శకులు.

దేశంలో ముఖ్యమైన వరి, జొన్న, సోర్గం, మిల్లెట్, బంగాళాదుంపలమీద మరియు నువ్వులనూనె, వేరుశనగ నూనె, పామ్ ఆయిల్ వంటి నూనెలమీద తీవ్రమైన విస్తృత పరిశోధనలు కావించారు. లాంగ్ స్టేపిల్ కాటన్‌ను దిగుమతి చేసుకునే అవసరం తగ్గించడానికి సహకరించే టట్లు విజయవంతంగా వీరు MCU - 5 అనే క్రొత్త ప్రత్తిరకాన్ని ప్రవేశపెట్టారు.

వ్యవసాయ మరియు వృక్షశాస్త్రవిభాగంలో వీరి అపూర్వకృషికి భారత ప్రభుత్వం వీరికి 1967లో మొట్టమొదట పద్మశ్రీ, 1972లో పద్మ భూషణ్, 1989లో పద్మవిభూషణ్ బిరుదులను ఇచ్చి గౌరవించింది.

జీవశాస్త్ర విభాగంలో వీరు సాధించిన ఉద్య మాలకు 1961లో శాంతిస్వరూప్ భట్‌నగర్ అవార్డును పొందారు. 1986లో కర్షకులకు వీరిసేవలను గుర్తించి భారత్ కృషక్ సమాజ్ వరల్డ్ అగ్రికల్చర్ ఫెయిర్ మెమోరియల్ ట్రస్ట్ సొసైటీవారు 'కృషిరత్న' బిరుదును ఇచ్చి గౌరవించారు.

1971లో కమ్యూనిటీ లీడర్‌షిప్‌కి రామన్ మాగ్‌సెసే అవార్డు, 1986లో వరల్డ్ కల్చురల్ కౌన్సిల్‌చే ఆల్‌బర్ట్ ఐన్‌స్టైన్ వరల్డ్‌సైన్స్ అవార్డు వీరు పొందిన అంతర్జాతీయ అవార్డులు. 1987 అక్టోబరు, 6 న యుఎస్‌ఏ వాషింగ్‌టన్ DCలో స్మిత్‌సోనియన్ ఇన్‌స్టిట్యూషన్ వారిచే మొట్టమొదటి వరల్డ్ ఫుడ్ పారితోషికం బహూక రించబడింది. ఆహార మరియు వ్యవసాయ రంగంలో ఇది నోబెల్ బహుమానానికి సమానము.

డా.స్వామినాథన్ లెక్కలేనన్ని జాతీయ మరియు అంతర్జాతీయ అవార్డులను, పతకాలను, బహుమతులను పొందారు. అనేక జాతీయ మరియు అంతర్జాతీయ సైన్స్ అకాడమీలు మరియు సొసైటీలలో సభ్యులుగా ఉన్నారు.

వీరు ఫుడ్ సెక్యూరిటీ, అగ్రికల్చర్, ఫారెస్ట్రీ మరియు ఎన్విరాన్‌మెంట్‌కు ఎన్విరాన్‌మెంట్ అండ్ డెవలప్‌మెంట్ వరల్డ్ కమిషన్‌లో అడ్వైజరీ మండలి ఛైర్మన్‌గా ఉన్నారు. అనేక జాతీయ మరియు అంతర్జాతీయ నిపుణుల కమిటీలలో ఛైర్మన్ పదవిని అధిష్టించారు.

(మిగతా 43వ పేజీలో)

## ఒక ప్రముఖ వ్యక్తివి నీవు



*నీవు ఒక ప్రముఖవ్యక్తివి. నీ అంతరంగిక యోచనలు, నీ కలలు పూర్తిగా తెలుసుకున్న వ్యక్తివి నీవు. ఆత్మ విశ్వాసం ముఖ్యం. నీలో నీకు విశ్వాసం ఉండాలి. నీ ఆశయాలకు, స్వప్నాలకు నీకు నమ్మకం ఉండాలి. నీలో ఎంతో సృజనాత్మక శక్తి ఉంది. తొందరపడకు. మెల్లిగా చేయి. నీవంటి వాడు ఇంకొకడులేడు. నీవు అద్వితీయుడవు. ఎప్పుడూ మంచి యోచనలతో ఆనందంగా ఉండు. నిన్నే నమ్ముకున్నాం, మమ్ము మోసగించకు. నీ ప్రేమానుభూతి, నీ మందహాసం మాకు ప్రతీ రోజూ కావాలి.*

-'ముర్రే మాక్‌బ్రైడ్స్ మానేజ్‌మెంట్ ఫోరం' సౌజన్యంతో

"అంతరాత్మకు సంబంధించిన విషయమైతే
మెజారిటీ అనే నిబంధనకు తావు ఉండదు."
—గాంధీజీ

# భగవంతునిపై విశ్వాసమే నన్ను రక్షించింది

సుమారు 50 సంవత్సరాలకు పూర్వం ఇప్పుడు పాకిస్థాన్‌లో ఉన్న క్వెట్టాలో ఒక భయంకరమైన భూకంపం ఏర్పడింది. భూమి కంపించిపోయి పెద్ద పెద్ద భవనాలు, ఇళ్లు నేలమట్టం అయిపోయాయి. రహదారులు, రోడ్లు బాగా దెబ్బతిన్నాయి. రైలుదారులు



ధ్వంసం అయిపోయాయి. ఎక్కడ చూచినా గందరగోళం, దుఃఖం, యాతన, మరణం. నగరం శిథిలావస్థలో ఉంది. ఇనుపకమ్మీలు, స్తంభాలు వంకరలు తిరిగిపోయాయి. వాహనాలు పూర్తిగా నామరూపాలు లేకుండా పోయాయి. ఎక్కడ చూచినా మరణించిన కళేబరాలు. వేల కొద్దీ జనం మరణించారు, వికలాంగులై పోయారు, గాయపడ్డారు. పురుషులు, స్త్రీలు, పిల్లల శరీరాలు చిందర వందరగా చీలి పోయాయి. సహకారానికి 'ఆర్యసమాజ్' మరియు ప్రభుత్వసంస్థలు పూనుకున్నాయి. వేలకొద్దీ స్వచ్ఛంధ సేవకులు భారతదేశం నుంచి బయలుదేరి సహకారోద్యమాలలో కొన ఊపిరితో ఉన్న వ్యక్తులను శిథిలాల నుంచి బయటకు తీసారు. ఆతరువాత మరణించిన శవాలను తీయుటకు ప్రారంభించారు. త్రవ్వకాల్ను, తొలగింపులు ముమ్మరంగా జరుగుతున్నాయి.

ఇరవైరోజులు గడిచాయి. ఒకరోజున రక్షణ దారులకు అకస్మాత్తుగా శిథిలాల గుట్టలోంచి 'గాయత్రీ మంత్రం' వినిపిస్తోంది. వెంటనే సేవకులు అతి జాగ్రత్తగా శిథిలాలను పెల్ల గించారు. ఒక వ్యక్తి కనిపించాడు. శరీరంపైన ఎటువంటి గాయంలేదు. పూర్తిగా ఆరోగ్యంగా ఉన్నాడు. వారు నమ్మలేకపోయారు. 'ఒక మనిషి ఇన్ని రోజులు ఈ శిథిలాలలో ఉండగలడా'

(42వ పేజీ తరువాయి)

జాతీయ మరియు అంతర్జాతీయ పత్రికలకు 200 లకు పైగా పరిశోధక వ్యాసాలను వ్రాసారు. అనేక గ్రంథాలను రచించారు. ప్రస్తుతం డా.స్వామినాథన్ భారతదేశంలో ఇంటర్నేషనల్ యూనియన్ ఫర్‌ది కన్సర్వేషన్ ఆఫ్‌నేచర్ మరియు నేచురల్ రిసోర్సెస్, వరల్డ్ వైడ్ ఫండ్ ఫర్ నేచర్‌కి అధ్యక్షుడుగా ఉన్నారు.

భారత సాంప్రదాయక మరియు సరిహద్దు సాంకేతిక విజ్ఞాన సమైక్యతపై నిరంతర వ్యవ సాయక మరియు గ్రామీణ అభివృద్ధికి మద్రాసులో పరిశోధక కేంద్రాన్ని అభివృద్ధి చేస్తున్నారు.

డా.స్వామినాథన్ ప్రపంచపు విశిష్ఠ వ్యవ సాయ శాస్త్రజ్ఞులలో ఒకరు. 1960 మరియు 1982 సంవత్సరాల మధ్య భారతదేశంలో హరితవిప్లవంలో ముఖ్యపాత్రను వహించారు. ప్రపంచ చరిత్ర పుటలలో వీరిపేరు సుప్రసిద్ధ శాస్త్రజ్ఞులుగా లిఖించబడుతుంది.

"భావానికి భాష భూషణం."

అని ఆశ్చర్యపడిపోయారు. అతడు చెప్పిన కథ ఇది-

"నాపేరు భగత్‌రామ్. నేను పళ్లు అమ్ముకుంటాను. భూకంపం సంభవించినప్పుడు నేను నా అంగడిలో కూర్చున్నాను. రెండు పెద్దపెద్ద దూలాలు నా మీద ఏటవాలుగా పడి ఒక గుహలాగా ఏర్పడింది. ఇటుకలు, మట్టి నాచుట్టూ పేరుకుపోయాయి. అదృష్ట వశాత్తు నా తలపైగానీ, నా శరీరంపైగానీ ఒక్క ఇటుక కూడా పడలేదు. నాకు ఎటువంటి గాయం ఏర్పడలేదు. కానీ ఊపిరి తీసుకోడానికి గాలిలేదు. ఉక్కిరి బిక్కిరి అయిపోయింది. తిరిగి భూమి కంపించిన శబ్దం వినిపించింది. ఎక్కడా ఏమీ తెలియలేదు. ఒకవిధమైన వాహిక ఏర్పడింది. అందులో నుంచి హెూరు మంటూ మంచిగాలి రావడం ప్రారంభించింది. ఊపిరి ఆడింది, మంచి గాలి పీల్చుకుంటున్నాను. బ్రతుకు జీవుడా అనిపించింది. బ్రతుకగలను అనే ఆశ బయలుదేరింది. నేను అమ్ముకునే పళ్ళు కావలసినన్ని అక్కడే ఉన్నాయి. అరటి పళ్లు, నారింజపళ్లు రకరకాలు. అవి తిన్నాను. త్రాగడానికి నీరులేదు. విపరీతమైన దాహం. ఇంతలో మరోభూకంపం బయలుదేరింది. భూమి రెండుగా చీలిపోయింది. ఒక నీటి గొట్టం పగిలింది. నీరు పైకి చిమ్ముతూంది. అలానీరు నిరంతరం వస్తూనే ఉంది. కావలసినంత నీరు త్రాగాను. దప్పిక తీర్చుకున్నాను. శుభ్రంగా కాళ్లూ, చేతులు కడుగుకున్నాను కూడా.

నేను కృష్ణభక్తుడను. శ్రీకృష్ణుడు నా ఆరాధ్య దైవం. భగవద్గీతను నిత్యం పారాయణం చేసి దానిని అనుసరిస్తాను. ఇక్కడ ఉన్నంతకాలం భగవద్గీత శ్లోకాలను పునశ్చరణ చేసుకుంటున్నాను. గాయత్రీ జపం చేసుకుంటున్నాను. శ్రీకృష్ణ భగవానుని యందు నా విశ్వాసమే నాకు రక్ష అయింది. మీరు నన్ను పైకి తీస్తున్న సమయంలో మిగిలిన ఒక్క నారింజపండు తింటున్నాను. ఆశ్రీకృష్ణభగవానుడే మీరూపంలో వచ్చాడని నమ్ముతున్నాను. భగవంతుని లీలలు ఎంత అద్భుతం! అతడియందు అకుంఠిత విశ్వాసమే నన్ను రక్షించింది."

భగవంతునిపై విశ్వాసం ఉండాలి. మీలో మీకు నమ్మకం ఉండాలి. మనజీవితంలో విశ్వాసం ముఖ్యం. ఏరంగంలోనైనా విజయానికి విశ్వాసం ఉండాలి.

ఎస్.పి.కొహ్లీ(లండన్)

●



"శాసనం అంతరిస్తే నిరంకుశత్వం ప్రారంభమవుతుంది."

# వీరిని గురించి తెలుసుకోండి

ఫ్రాంక్లిన్ జె షాఫ్‌నెర్:అకాడమీ అవార్డు పొందిన హాలీవుడ్ డైరక్టరు. 1970 లో ఇతడు తీసిన 'పటాన్'(Patton) చిత్రం ఉత్తమ చలన చిత్రంగా ఏడు ఆస్కార్‌లు పొందింది. ఇతడు తీసిన ఇటువంటి సుప్రసిద్ధ చిత్రాలు 1973లో పాపిలాన్(Papillon), 1968లో విజ్ఞాన శాస్త్ర సంబంధమైన 'ప్లానెట్ ఆఫ్ ది ఏప్స్' మరియు 'ది బాయిస్ ఫ్రమ్ బ్రెజిల్'.

* * *

మహాదేవీవర్మ: సుప్రసిద్ధ హిందీ కవయిత్రి. హిందీ కవిత్వంలో మీరాగా ప్రసిద్ధి పొందింది. సుమిత్రా నందన్ పంత్ మరియు సూర్యకాంత్ త్రిపాఠి (నిరాల) సహాయంతో ఈమె హిందీ భాషకు ఒక సరిక్రొత్త రూపం తీసుకు వచ్చింది. సౌకుమార్యం, నిగూఢత్వంతో అద్భుత రసాన్ని పోషించింది.

* * *

మారిస్ ఎల్లైస్:నోబెల్ బహుమతిని పొందిన ఫ్రెంచిదేశపు ఆర్థిక వేత్త. ఫ్రాన్స్‌లో పబ్లిక్ సెక్టార్ ప్లానింగ్‌లో సిద్ధాంతికంగానూ, అనుసరణ యోగ్యంగాను ఆధునిక అర్థశాస్త్రం పరిశోధకులలో ముఖ్యుడు. థియరీ ఆఫ్ మార్కెట్స్ మరియు వివిధ వనరులను సామర్థ్య వంతంగా వినియోగించుకోడం అనే విషయాల మీద విపులంగా వ్రాశాడు.

* * *

హెర్మెన్ మెల్‌విల్లీ (1819-1891) :గొప్ప అమెరికా రచయిత. సముద్రం మీద మరియు అసాధారణ ప్రదేశాలలో జీవితం గురించి అద్భుతమైన గ్రంథాలు రచించాడు. 'మోబీడిక్' (1851) ఇతడి సుప్రసిద్ధ రచన.

* * *

## ఎవరి ధర్మం వారు ఆచరించాలి



ప్రజాభిప్రాయం లెక్కచేయకుండా ఎవరి ధర్మం వారు ఆచరించాలి. ఇతరులకు తప్పుగా తోచినా మనకు ధర్మం అని తోచిన మనధర్మం మనం ఆచరించి తీరాలి. అదే సక్రమమైన మార్గం అని అభ్యాసం వల్ల తెలిసివస్తుంది. అసత్యం సత్యంగానూ, సత్యం అసత్యంగానూ అనిపించవచ్చు అని నేను ఒప్పుకుంటాను. కానీ తెలియకుండా చేసిన తప్పు తప్పని తెలుసుకుంటారు. ప్రజాభిప్రాయం గానీ, మరిదేనికైనా గానీ మానవుడు లోవెలుగును ఉపయోగించుకోకపోతే సత్యాన్ని తెలుసుకోలేరు. చివరికి సత్యాసత్యాలకు ఉండే తారతమ్యం తెలుసుకోలేరు.

-మహాత్మాగాంధీ

"అంతరాత్మ భోదనకు విరుద్ధంగా ఆచరించే నాయకుడు వినాయకుడు."

—గాంధీజీ

మెర్విన్ లారే : అమెరికాలో ప్రఖ్యాతి పొందిన ప్రొడ్యూసర్ మరియు డైరక్టరు. 'విజర్డ్ ఆఫ్ ఓజ్', 'ది హౌస్ ఐలివ్ ఇన్'(ఫ్రాంక్ సినాత్రాతో నటించిన చిత్రం), 'రాండం హార్వెస్ట్', మరియు 'లిటిల్ సీసర్' ఇతడు తీసిన ముఖ్యమైన చిత్రాలు.

* * *

జోసెఫ్ పులిట్జర్ : హంగేరియాలో పుట్టిన పరదేశి. యుఎస్ఎలో వార్తాపత్రిక ప్రచురణ దారుడుగా గొప్ప ధనవంతుడైనాడు. గొప్ప గొప్ప అమెరికన్ రచయితలకు, సంగీత విద్వాంసులకు ప్రతీ సంవత్సరం బహుమతులు ఇచ్చుటకు ఇతడు కొలంబియా యూనివర్సిటీకి 2 మిలియన్ డాలర్ల సొమ్ము వ్రాసి ఇచ్చాడు.

* * *

జార్జి వాషింగ్‌టన్ కార్వెర్ (1864-1943) : నల్ల జాతికి చెందిన అమెరికన్ వృక్షశాస్త్రజ్ఞుడు. బానిసగా ఉంటూ 20 వ శతాబ్దపు సుప్రసిద్ధ శాస్త్రపరిశోధకుడుగా ప్రసిద్ధి పొందాడు. వేరు శనగక్కు ఇతడు 300కు పైగా ఉపయోగాలను కనిపెట్టాడు. తియ్య దుంపల నుండి 118 రకాల వస్తువులను ఉత్పాదించాడు. ఇతడు తన జీవితంలో సంపాదించిన ధనంతో 1940లో టుస్కీగీలో అగ్రికల్చరల్ రీసెర్చికి జార్జి వాషింగ్‌టన్ కార్వెర్ ఫౌండేషన్ను ఏర్పాటు చేసాడు.

* * *

జె.బి.హెచ్.వాడియా : సుప్రసిద్ధ ఫిల్ము ప్రొడ్యూసరు. ఇతడి స్టంట్ సినీమా 'హంటర్ వాలీ' 1930వ దశాబ్దంలో ప్రసిద్ధి పొందింది. సింధీలో మొట్టమొదటి సినీమా 'ఏక్‌తా'ను తీసాడు.

# మొహిందర్ అమర్‌నాథ్ ముదస్సర్ నజర్




* *మొహిందర్ అమర్‌నాథ్ ఇండియాకి 101వ టెస్ట్ సెంచరీచేశాడు. ముదస్సర్ నజర్ పాకిస్థాన్‌కి 101వ టెస్ట్ సెంచరీ చేశాడు.*

* *మొహిందర్ అమర్‌నాథ్ 24-12-1969న ఆస్ట్రేలియాతో టెస్ట్‌లో మొట్టమొదట ఆడాడు. ముదస్సర్ నజర్ 24-12-1976న ఆస్ట్రేలియాతో టెస్ట్‌లో మొట్టమొదట ఆడాడు.*

* *ఇద్దరు బాట్స్‌మన్‌లు 1982లో ఒకే మాచ్‌లో కరాచిలో 2000వ టెస్ట్‌పరుగును చేసారు.*

* *ఇద్దరు బాట్స్‌మన్ ఒకే వారంలో వారి మెయిడెన్ టెస్ట్‌సెంచరీలను చేసారు. మొహిందర్ పెర్త్(పశ్చిమ ఆస్ట్రేలియా)లో 20-12-1977న, ముదస్సర్ లాహోర్ (పాకిస్తాన్)లో 15-12-1977న.*

*— 'ది క్రికెటర్ ఇంటర్నేషనల్' సౌజన్యంతో*

"విచిత్రమైన కర్మాకర్మల సమ్మేళనమే మనకు నిజమైన గమ్యము."

# మీకు తెలుసా?

## ప్రపంచంలో యునైటెడ్ స్టేట్స్ అధికంగా పొగాకును ఉత్పాదిస్తూంది

యునైటెడ్ స్టేట్స్ ప్రపంచంలో అన్ని దేశాల కంటే అధికంగా పొగాకును పండి



స్తూంది. క్యూబా మరియు జమైకా (కరేబియన్ సముద్రం) ముఖ్యంగా చుట్టలకు ఉపయోగించే ప్రత్యేకమైన పొగాకును ఉత్పాదిస్తున్నాయి. వివిధ రకాల పొగాకులో వర్జీనియా లేక 'బ్రైట్' యునైటెడ్ స్టేట్స్‌లో ఉత్పాదింపబడుతూంది. 'లాటాకియా' అనే ఘాటైన పొగాకు సిరియా (పశ్చిమ ఆసియా)లో పండింపబడుతూంది.

* * *

## చిల్కా సరస్సు మంచి నీటి సరస్సుకాదు

బంగాళాఖాతానికి చేరి ఉంది కాబట్టే ఒరిస్సాలో చిల్కా (chilka) సరస్సు మంచినీటి సరస్సు కాదు.

* * *

## ఫ్లోరా మరియు ఫానా

ఆంగ్లభాషలో ఫ్లోరా అండ్ ఫానా (Flora and Fauna) అంటారు. ఫ్లోరా అంటే ఒకదేశంలో వృక్షసంపద. ఫానా అంటే జంతుజాలం.

* * *

## యూరప్‌లో సుదీర్ఘమైన నది

యూరప్‌లో వోల్గా మిక్కిలి పొడవైన నది.

* * *

## భారతదేశపు మొట్టమొదటి సౌరశక్తిటెలివిషన్ ట్రాన్స్‌మిటర్

భారత దేశంలో మదూర నియంత్రిత సౌరశక్తి టెలివిషన్ ట్రాన్స్‌మిటర్ రాజస్థాన్‌లో కోటాదగ్గర రావాట్‌బాటాలో ఏర్పాటు చేయబడింది.

* * *

## సోమలతను భారతదేశంలో దేవతగా పూజిస్తారు

భారతదేశంలో సోమలతను *(Soma Plant)* దేవతగా పూజిస్తారు. దీనిని గురించి వేదంలో 114 గీతాలు ఉన్నాయి.

* * *

## ప్రపంచంలో మొట్టమొదట ఇంజన్‌తో నడిచిన రైలుబండి

ప్రపంచంలో మొట్టమొదట బ్రిటన్‌లో స్టాక్‌టన్ మరియు డార్లింగ్‌టన్ రైల్వే మీద ఇంజన్ సహాయంతో రైలుబండి నడుపబడింది. దీనిని 1825లో ప్రారంభం చేసారు. జార్జి స్టీఫెన్‌సన్ దీనిని నిర్మించాడు. ●

"హృదయం లేనిది బండరాయి."

# మేకపాలు

పవన్ కుమార్

పశువుల కంటే మేకలు రూపంలో చాలా చిన్నవి అయితే పశువుల కంటే త్వరగా పెరుగు తాయి. ఎటువంటి విపరీత వాతావరణంలోనైనా, ఏ పరిస్థితులకైనా అతిశీఘ్రంగా అలవాటు పడతాయి. వీటికి అమోఘమైన జీర్ణశక్తి ఉంది. ఎడారి ప్రదేశాలలో కూడా బాగా పాలను ఇస్తాయి. అందుచేతే పెంచుకోడానికి



పశువులకంటే మేకలు 24 శాతం అధికంగా ఉత్తమమైనవిగా పరిగణిస్తారు. మేకలు అనేక విధాలుగా ఉపయోగపడతాయి. అతి తక్కువ ప్రదేశంలో తక్కువ వ్యయంతో వీటిని నిర్వహించ వచ్చు. వీటికాళ్లు చాకచక్యంగా ఉండటం వల్ల ఇతర పెంపుడు జంతువులు చొరలేని ఎటువంటి ఎత్తైన ప్రదేశాలకైనా ఎక్కి ఇవి ఆహారం సంపాదించుకుంటాయి.

మానవుడు మొట్టమొదట ఇరాన్‌లో మేకను బహుశః 10,000 సంవత్సరాలకు పూర్వం పెంచడం ప్రారంభించి ఉండాలి. ఈనాడు ప్రపంచంలో చాలా చోట్ల పాలకు, వెన్నకు, మాంసానికి, చర్మపు వస్తువులకు పెంపుడు మేక మనకు ఆధారం.

భారతదేశపు వివిధ ప్రదేశాలలో మొత్తం 15 జాతుల మేకలు ఉన్నాయి. భారతదేశంలో అడవి జాతి మేకలు ఐబెక్స్ మరియు మార్ఖోర్ జాతులనుండే పెంపుడుమేకలు వృద్ధిచేయబడ్డాయి.

సుమారు 12 మొదలు 127 కి.గ్రా.లు తూగే మేక జీవిత కాలం 9 సంవత్సరాలు. ఆడమేక కంటే మగమేకలు పెద్దవిగా ఉంటాయి. మగవాటికి గడ్డం క్రింద వెంట్రుకలు ఉంటాయి. ఆడవి 14 మాసాలకు ఒకసారి ఎక్కువగా పిల్లలను కంటూంటాయి. అప్పుడప్పుడు రెండేసి, మూడేసి పిల్లలను కూడా కంటాయి.

మేకలు మేతమేసేటప్పుడు ఆహారం బాగా నమిలి తినవు. అతి శీఘ్రంగా తినగలిగినంత తినేసి, నిరపాయకరమైన ఏకాంత ప్రదేశంలో స్థావకాశంగా విశ్రమించి నెమరు వేసి నమిలి తింటాయి. ఈ విధంగా తిన్న ఆహారాన్ని బాగా జీర్ణం చేసుకుంటాయి. పశువులు,

[redacted]

"లేనివారికి సాయపడడానికే ఉన్నవారు కృషిచెయ్యాలి."

ఒంటెలు, దుప్పులు మొదలైనవి కూడా ఆహారాన్ని నెమరు వేసి తింటాయి. ఈ జంతువులన్నీ బాగా పీచుగా ఉన్న పొడుగాటి గడ్డి తినడం వల్ల నెమరువేయడం అవసరం.

మేకపాలు అన్ని విధాల మానవుల చనుపాలను పోలి ఉంటాయి. చనుపాలలాగే చాలా రుచికరమైనవి, పుష్టికరమైనవి. మేకపాలలో క్రొవ్వు కణాలు చాలా చిన్నవిగా ఉండటం చేత ఈపాలు సులభంగా జీర్ణమవుతాయి. క్షయరోగ క్రిములు ఉండవు. అందుచేతే చాలామంది పసిపిల్లలకు,రోగులకు మేకపాలను ఇస్తూంటారు.

భారతదేశంలో ముఖ్యంగా మాంసం కోసం మేకలను పెంచుతారు. చాలామంది హిందువులకు గోవధ నిషేధం కాబట్టి మాంసం కోసం మేకలమీదే ఆధారపడి ఉంటారు.

జోళ్ల తయారీకి మేకచర్మం ఉపయోగిస్తారు. పాష్మినా వంటి కొన్ని ఉత్తమ జాతి మేకల బొచ్చుతో నేసిన కంబళ్లు చాలా ప్రసిద్ధి చెందినవి. పశువుల ఎరువు కంటే, మేకల పెంట గులాబి వంటి కొన్ని పూలమొక్కలకు ఉత్తమమైన ఎరువుగా పరిగణిస్తారు.

సాధారణంగా ఇవి మొక్కలను తినేటప్పుడు వ్రేళ్లతో సహాపీక్కుని తింటాయి. అందుచేత మొక్కలకు, తీగలకు ఇవి హాని కలిగించి అయాజాతులను వృద్ధి పొందనీయవు. భూమి మీద మొక్కలను, గడ్డిని తినేసి పూర్తిగా భూమిని బీడుప్రదేశంగా చేసేస్తాయి. చివరకి ఇవి ఎడారి ప్రదేశాలుగా మారుతాయి. అందుచేత కొన్ని కొన్ని ప్రదేశాలలో కలుపు మొక్కలను నాశనం చేయడానికి మేకలను పెంచుతూంటారు.

- 'సిఇఇ.ఎన్ ఎఫ్ ఎస్' సౌజన్యంతో

## ఫ్రాంక్లిన్ డి. రూస్‌వెల్ట్ నాలుగుసార్లు ఎన్నుకోబడ్డాడు




*అమెరికా అధ్యక్షుడు ఫ్రాంక్లిన్ డి. రూస్‌వెల్ట్ నాలుగు పర్యాయాలు అధ్యక్ష పదవికి ఎన్నుకోబడటం ఒక రికార్డు. ఇతడి ఉపన్యాసధోరణిలో సందర్భానుసారంగా నాటకీయత లేక నవ్వు పుట్టించేహాస్యం అక్కడక్కడ చేరుస్తూంటారు. ఇతడి ఉపన్యాసం వినడానికి వేలకువేలు జనం రేడియోల దగ్గరకాచుకుని కూర్చునేవారు. సాధారణంగా మాట్లాడేటప్పుడు కూడా ఇతడి ధోరణి అలాగే ఉండేది.*

*1932లోఇతడి ప్రత్యర్థి హెూవర్ పరపతి చెడిపోవడమే గాక పూర్తిగా అధైర్యంతో క్రుంగిపోయారు. 1936లో రూస్‌వెల్ట్ పొందిన ఆదరణకి ప్రత్యర్థి లాండన్ అణగారిపోయారు. 1940లో రూస్‌వెల్ట్ ఒకే ఒక ప్రత్యర్థి వెండల్ విల్కీని గౌరవించారు. ఇతడు రూస్‌వెల్ట్ సర్వాధికారత్వాన్ని ఎదిరించాడు. కానీ ఓటర్ల దరిదాపులకు రాలేకపోయాడు. రూస్‌వెల్ట్‌ను ఓటర్లు గెలిపించారు. ప్రజలకు రూస్‌వెల్ట్ రూపుగొన్న(డెమోక్రసీ) ప్రజాప్రభుత్వం. 1944లో థామస్ ఇ డ్యూవే రూస్‌వెల్ట్ తో పోటీ చేసాడు. ఇతడు అమెరికా రాజకీయరంగంలో మిక్కిలి ప్రసిద్ధి పొందిన వాక్చతురుడు కూడా. కాని రూస్‌వెల్ట్‌తో పోటీ పడలేకపోయాడు. రూస్‌వెల్ట్ ప్రత్యేక వ్యక్తిత్వానికి ఓటర్లు ముగ్ధులైపోయారు.*

"ప్రపంచంలో ఉండే సంపదలన్నీ లభించినా
ఏదోలేదని ఏడ్చేవాడు లోభి."

# ఫిన్‌లాండ్

## వాటర్‌ఎర్‌కో, కుల్లెర్వో కెంపినెన్

ఫిన్‌లాండ్ యూరప్‌కి ఉత్తరదిక్కుగా ఉంది. ఫిన్‌లాండ్ గల్ఫ్ తీరములనుండి దగ్గర దగ్గర ఆర్కిటిక్ మహాసముద్రం వరకు వ్యాపించి ఉంటుంది. సోవియెట్ యూనియన్, ఫ్రాన్స్, స్పెయిన్ మరియు స్వీడెన్‌ల తరువాత ఇది యూరప్‌లో అయిదవ పెద్ద దేశము. యూరప్‌లో మిక్కిలి తక్కువ జన సాంద్రతగల ఈదేశంలో ఒక చదరపు కిలోమీటరు వైశాల్యానికి 14 మందే నివసిస్తున్నారు.

1155లో స్వీడెన్ దేశపురాజైన ఎరిక్ ది గుడ్ ఫిన్‌లాండ్‌పై దండెత్తి ఆక్రమించుకున్నాడు.




ఉప్‌సాలాకు చెందిన బిషప్ హెన్రీ అనే ఆంగ్లేయుని సహాయంతో ఎరిక్ బలవంతులైన ఫిన్‌లాండ్ దేశీయులను ఓడించాడు. ఈవిధంగా ఇతడు ఫిన్‌లాండ్ మరియు స్వీడెన్ దేశస్థుల దీర్ఘ చరిత్రలో ఒక నవయుగాన్ని స్థాపించాడు.

1809 వరకు ఫిన్‌లాండ్ స్వీడెన్‌లో రాజ్యభాగంగా ఉంది. సుమారు 700 సంవత్సరాల కాల వ్యవధిలో స్వీడెన్‌కు చెందిన మతగురువులు, ఇతర పన్ను వసూలుదారులు నిత్య పోరాటాలకు, యుద్ధాలకు, స్వీడిష్ సైన్య సహకారేద్యమాలకు పన్నులు వసూలు చేస్తూండేవారు. ఒక సాంఘిక వ్యవస్థ ఏర్పడి దాని అభివృద్ధికి తోడ్పడుటయేగాక సంఘంలో జాతీయ చైతన్యత ఏర్పడుటకు కూడా వీరు సహకరించారు.

1808-09లో జరిగిన రష్యా- స్వీడిష్ యుద్ధ ఫలితంగా ఫిన్‌లాండ్ బలవంతంగా రష్యా



వశం చేయబడింది. ఫిన్‌లాండ్‌ను రష్యా జార్ ఒక స్వయంపాలిత గ్రాండ్ డచ్చీగా మార్చాడు దాని ఫలితంగా అతడు ఫిన్‌లాండ్ గ్రాండ్ డ్యూక్ పదవిని పొందాడు. సుమారు 108 సంవత్సరాల ఈ సంబంధ బాంధవ్యాలు 4 జారుల వరకు కొనసాగి 1917లో అంతమొందింది.

1917లో రష్యావిప్లవం రష్యాలో ఉన్న అనేక మైనారిటీలకు స్వాతంత్ర్యావకాశాలు కల్పించింది. 1917 డిసెంబరు 6న, ఫిన్‌లాండ్ స్వాతంత్ర్యాన్ని ప్రకటించింది. ఒక ఫిన్నిష్ ప్రతినిధి వర్గం డిసెంబరు 31న పెట్రోగాడ్‌కి వెళ్లి బోల్షివిక్ నాయకుడైన వి.ఐ. లెనిన్‌ను కలుసుకుని, క్రొత్తగా ఉద్భవించిన ఫిన్‌లాండ్ రిపబ్లిక్‌కి గుర్తింపును పొందగలిగారు.

"జీవితంలో కష్టాలు మధురప్రయోజనాలు."

స్వాతంత్ర్యంవల్ల ఫిన్‌లాండ్ మానవ జీవితంలో విద్య, విజ్ఞానం, కళావాఙ్మయం, పరిశ్రమ, విదేశీ వ్యాపారం, వ్యవసాయం, సాంఘిక సేవ వంటి అనేక రంగాలలో అద్భుత మైన పురోభివృద్ధిని సిద్ధించుకుంది.

1939-40 మరియు 1941-44 సంవత్సరాలలో సోవియెట్ యూనియన్‌తో ఫిన్‌లాండ్ యుద్ధాలు రెండవ ప్రపంచ యుద్ధ సందర్భముగా పరిశీలించ వలసి ఉంటుంది.

ఫిన్‌లాండ్ దట్టమైన పచ్చని అరణ్యాలతో స్ఫటిక స్వచ్ఛమైన నీటి సరస్సులతో నిండి ఉంటుంది. మొత్తం వైశాల్యం (337 032 చ.కి.మీ.లు)లో మూడవవంతుకుపైగా బురద ప్రదేశంగానో లేక చెరువులతోనో ఉంటుంది. ఇది ఉత్తర దిక్కుగా ఏర్పడి ఉండటంవల్ల వేసవికాలంలో వెలుతురు తక్కువగాను, శీతా కాలంలో చిమ్మచీకటిగాను ఉంటుంది. లాప్లాండ్‌లో రెండు వేసవిమాసాలు పూర్తిగా అర్థరాత్రి సూర్యుడు కనిపిస్తాడు. శీతాకాలంలో సూర్యుడు కొన్నివారాల పాటు ఉదయించడు.

విశాలమైన అడవులలో ఎలుగుబంట్లు, నక్కలు, వొల్వెరైన్‌లు, లిన్‌క్సస్ వంటి అడవి జాతులు విస్తారంగా నివసిస్తాయి. లాప్లాండ్ ఎగువప్రదేశాలలో లాప్‌లు 200,000 రెయిన్ డీరులను మందకడతారు.

దేశంలో అత్యంత సుందరమైన 60,000 సరస్సులు - మొత్తం భూప్రదేశంలో తొమ్మిది శాతం ఆక్రమించి ఉంటాయి. లేక్ జిల్లాలలో 20 మొదలు 50 శాతం భూప్రదేశంలో ఇవి ఉంటాయి. నైరృతి దిక్కుగా అనేక చిన్న చిన్న దీవులు చేరి ఒక అపూర్వమైన అర్చిపెలాగ్ (Archipelago) ఏర్పడింది.

ఉత్తర ఫిన్‌లాండ్, స్వీడెన్ మరియు నార్వేకు చెందిన ఆదిమవాసులు - లాప్

## సుభాషితాలు

[illegible]

"అనిత్యమైన విషయాలపై అభిమానం దుఃఖానికి కారణం."

వానస్థలము లాప్లాండ్. అద్భుతమైన జాతికి చెందిన ఫిన్నిష్ లాప్‌లు 2000 ంది సాంప్రదాయకమైన దుస్తులతో, ఆభర లతో, ఆచారాలతో అందంగా ఉంటారు.

ఫిన్నిష్ భాష చాలా వింతగానూ, మిక్కిలి ంకీర్ణంగా ఉంటుంది. వీరి భాష ఫిన్నో గ్రిక్ భాషకు చెందినది. ఇందలి పదజాలము, క్య నిర్మాణము అతి ప్రాచీనమైనది.

జె.కె.పాసికివి (1946-56) మరియు యు.కె. క్కనెన్ (1956-1982) వంటి గొప్ప గొప్ప రాజకీయ పరంధరులు నాయకులుగా ఉండటం వల్ల వికి ఎటువంటి అపాయం వాటిల్లలేదు. 6 సంవత్సరాల సుదీర్ఘకాల పరిమితిలో క్కనెన్ సోవియెట్ యూనియన్‌తో ఫిన్ ండ్ సంబంధ బాంధవ్యాలను బలపరచాడు. లీవ విధానాన్ని బలపరచాడు. పరస్పర హార్ధాన్ని పెంపొందించాడు.

ఫిన్‌లాండ్ పెద్ద దేశాలకంటేకూడా స్వతం ంగా ఉంటుంది. దీని పార్లమెంటులో ఎనిమిది జకీయ పక్షాలు ఉన్నాయి. ఒక స్వాతంత్ర్య ్యాయస్థానం ఉంది. వీరికి పత్రికా స్వాతంత్ర్యం ఉంది.

చరిత్ర ప్రారంభంలోనే ఫిన్‌లాండ్ కాలెవాలా Kalevala), సిబెలియస్ (Sibelius) వంటి ప్రపంచ ప్రసిద్ధిచెందిన మహాకావ్యాలను సృష్టించింది. సృజనాత్మకమైన మప్రసిద్ధ గాయకులు అనేకమంది ఉన్నారు. అల్వార్ ల్టో మరియు సారినెన్స్ వంటి శిల్పులు అంతర్జాతీయంగా ప్రసిద్ధిపొందారు. 1939లో ఫ్రాన్స్ ఇ శిలాన్‌పాకి వాఙ్మయ సేవకు నోబెల్ బహుమానం లభించింది. 'ది ఊజిస్టియన్ ఊజ్ ఎఫినా' అనే గ్రంథాన్ని మికా వాల్టారి చించాడు. ఫిన్‌లాండ్‌లో ప్రపంచ క్రీడాకారులు, ఒలింపిక్ విజేతలు, ముఖ్యంగా ట్రాక్ అండ్ ఫీల్డ్ మరియు శీతాకాలపు క్రీడలలో పాల్గొనే ఛాంపియన్‌లు చాలామంది ఉన్నారు.

●

## ఐన్‌స్టెయిన్ - భగవద్గీత



*డా.బి.ఎమ్. గుప్తా అనే ఒకయువ పరిశోధకుడు యుఎస్‌లో ప్రిన్స్‌టన్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ అడ్వాన్స్‌డ్ స్టడీస్‌లో 1948లో డా. ఆల్బర్ట్ ఐన్‌స్టెయిన్‌ను కలుసుకున్నాడు. డా. ఐన్‌స్టెయిన్ ఆంగ్లంలో కాకుండా సంస్కృతంలో స్వాగతం చెప్పాడు. డా. గుప్తా సంస్కృతంలో జవాబు చెప్పడానికి తన అసమర్థతను తెలియజేసుకున్నాడు.*

*అప్పుడు ఐన్‌స్టెయిన్ "నువ్వు భారతదేశం నుంచి వస్తున్నావు. భారతదేశం హైందవ తత్త్వ శాస్త్రానికి, వేదాంతానికి పుట్టినిల్లు. అయినప్పటికీ నువ్వు సంస్కృతం నేర్చుకోడానికి ప్రయత్నించలేదు. నా లైబ్రరీ ఒక్కసారి చూడు. హిందూ తత్త్వశాస్త్రాన్ని గురించి, గీత, ఇంకా ఇతర సంస్కృతగ్రంథాలు ఎన్నోఉన్నాయి. ముఖ్యంగా నా వైజ్ఞానిక పరిశోధన లకు, సూత్రీకరణకు నాకు ముఖ్యంగా స్ఫూర్తి కలిగించింది గీత. నాకు మార్గదర్శి గీత" అన్నాడు.*

"ఒకప్రయత్నంలో పొందలేని లక్ష్యాన్ని పొందడానికి తీవ్రప్రయత్నంతో వేసే ముందడుగు సాధన."

# విజయానికి నిశ్చయమైన మార్గం

* నీజీవితానికి ఒక అమూల్యమైన విలువ ఉండాలంటే నీ గమ్యాన్ని చేరుకోడానికి లేక లక్ష్యాన్ని సాధించడానికి అభ్యుదయేచ్ఛ, కృత నిశ్చయం ఉండాలి.
* విజయం సాధించాలంటే ముఖ్యంగా అవసరమైనవి మూడు. (అ)విజయం పొందాలనే తీవ్రవాంఛ (ఆ) విజయం పొందడానికి ప్రయత్నం (ఇ) విజయం పొందేవరకు ఓపిక, పట్టుదల ఉండడం.
* జీవితంలో మన విజయాలన్నీ మనం ఎన్నిన ఉపాయాల మీదే ఆధారపడి ఉంటాయి.



వీటని ముందుగానే ఏర్పరచుకుంటే అతి సులువుగా కార్యాచరణలో పెట్టవచ్చు.
* నీ విజయ ఫలితం పంచుకునే విధానం నేర్చుకుంటే స్నేహితులకు కొదవ ఎంతమాత్రం ఉండదు. కలుపుగోరుతనం అభ్యసించుకో. ఆరోగ్యదాయకమైన ఉద్యమాలను చేపట్టు.
* నీవు ముందుగా యోజన ప్రకారం ఏర్పరచుకున్న మార్గాన్ని జాగ్రత్తగా, సామర్థ్యవంతంగా అనుసరించు. నీదే విజయం.

ముందు ఏ యోజన లేకుండా ప్రారంభి అన్నీ పొరపాట్లే జరుగుతాయి. చేసినదే తి చేస్తావు. కాలం వృథా అయిపోతుంది. ప్రయత్నాలన్నీ వృథా ప్రయాసగా పరిణమిస్తా మనస్సులో చింత, కలత ఏర్పడుతుంది.
* మంచి ఖ్యాతి, ప్రతిష్ఠ, యశస్సు పొందడా చిన్న వాడవని అనుకుంటావేమో-అలెగ్జాం




ది గ్రేట్ 33వ సంవత్సరం వయస్సు ప్రపంచాన్ని జయించాడు.
* మనం మన వ్యక్తిత్వాన్ని మరచిపో కించపరచుకుంటే శాంతి ఉండదు, సౌఖ్య ఉండదు, విజయం ఉండదు.
* వ్యక్తిత్వాన్ని నిలబెట్టుకోడానికి అవసరమైన మూడు. చిత్తశుద్ధి, వివేకం, అనుష్ఠానం. చిత్తశు వ్యక్తిత్వానికి పునాది. వివేకం వల్ల ధైర్య ఆత్మ విశ్వాసం కలుగుతుంది.
* విజయం అనే లక్ష్యాన్నే మానవుడు ఉత్సాహం కోరుకుంటాడు. పరాజయాలకు క్రుంగిపోకు

(మిగతా 56వ పేజీలో)

"జీవిత సర్వస్వాన్ని పరమాత్మునికి అంకితంచేసి
అతని వ్యక్తిత్వంతో నీ ఉనికిని దర్శించుకో."

# అవీ - ఇవీ

## భారతదేశంలో 1200 జాతుల అందమైన పక్షులు అంతరించి పోయాయి

భారతదేశంలో సుమారు 350 జాతుల క్షీరదాలు, 1200 జాతుల అందమైన పక్షులు



మరియు 2000 పైగా కీటకజాతులు పూర్తిగా అంతరించిపోయాయి. ప్రస్తుతం 69 జాతుల క్షీరదాలు, 40 జాతుల పక్షులు మరియు 22 జాతుల సరీసృపాలు, ఉభయచర జీవులు అంతరించే పరిస్థితులలో ఉన్నాయి. 45 సంవత్సరాలకు పూర్వం వేలకు వేలు ఉన్న రాయల్ బెంగాల్ పులులు అంతరించిపోయే భయంకర పరిస్థితులలో ఉన్నాయి.

* * *

## ప్రప్రథమంగా భారతదేశంలో విద్యుదీకరణ చేయబడిన నగరం

భారతదేశంలో మొట్టమొదటగా విద్యుదీకరణ చేయబడిన నగరం బెంగళూరు. నగరానికి 90 కి.మీ.ల దూరంలో ఉన్న శివసముద్రం జలపాతంనుంచి జనింపచేయబడిన విద్యుత్తుతో బెంగుళూరు విద్యుదీకరణ సమారంభం 1905 ఆగస్టులో జరిగింది. ఆనాడు 310 వీధి విద్యుద్దీపాలు వెలిగేవి. వీటిలో వాడినవి 15 వాట్ల బల్బులు.

* * *

## క్విజ్ - జవాబులు:

1. (డి) పశ్చిమబెంగాల్, 2. (డి) ఆర్.కె.లక్ష్మణ్, 3. (డి) మృదంగ, 4. (సి) ట్రస్టీషిప్ ప్రిన్సిపిల్, 5. (డి) గాంధీజీ, 6. (డి) సోవియెట్ యూనియన్, 7. (బి) కెన్యా 8. (సి) అతి నీలలోహిత కిరణాలకు సెలక్టివ్ ఫిల్టర్‌గా ఉపయోగపడుతుంది.

## తెలివికి పరీక్ష - జవాబులు:

1. గార్డియన్ ఇండియన్ నేషనల్ దినపత్రిక కాదు, 2. 20,18, 3. గ్రీన్‌లాండ్, 4. ఇవన్నీ యూరప్‌లో దేశాలు, 5. గర్వహేతువు, 6. మహాభారతము, 7. అనువాదము, 8. భావాన్ని వ్యక్తపరిచేది భాష.

## మాటలమహిమ - జవాబులు:

1.అవ్యక్త మధుర ధ్వని (ఎ), పావురము (బి), కోకిల (సి); 2. కలత (ఎ), చింత (బి), కలవరింత (సి); 3. చావడి (ఎ), సభాభవనము (బి), అసత్యము (సి), చలింపనిది (డి); 4. ప్రేమ (ఎ), చుట్టము (బి); 5. నమస్కారము (ఎ), మాయ (బి), మోసము (సి); 6. అనుకూలమైన సంబంధ యోగ్యత (ఎ); 7. వ్యర్థము (ఎ), నష్టము (బి); 8. అపేక్షించు (ఎ), మోహించు (బి), కోరు (డి).

"శాశ్వతమైన సామ్రాజ్యంలో భిన్నత్వానికి తావులేదు."

## అదనపు ఖర్చులేకుండా మలేరియా అంతరింపచేయబడింది

పాండిచ్చేరి తీరప్రదేశంలో పుదుక్కుప్పం అనే గ్రామంలో రసాయనిక కీటకనాశిని మందుల పైన ఒకపైసా ఖర్చుచేయకుండా మలేరియాజ్వరం పూర్తిగా అంతరింపచేయ



బడింది. పాండిచ్చేరిలో వెక్టార్ కంట్రోల్ రీసెర్చి సెంటర్‌లో పరిశోధకులు మలేరియాని పూర్తిగా నశింపజేయడానికి క్రొత్త విధానం కనిపెట్టారు. ఈ విధానాన్ని ఇంటగ్రేటెడ్ వెక్టార్ కంట్రోల్ (IVC) అంటారు. దోమలు ప్రవృద్ధి పొందే ప్రదేశాలను మూసివేయుట, దోమల లార్వాను తినే చేపలను పెంచుట, మైనర్ ఇంజనీరింగ్ పనులు చేపట్టుట, ఆరోగ్యాభివృద్ధి సంబంధమైన విద్యనేర్పుట, మలేరియా ముందుగానే కనిపెట్టి చికిత్సచేయుట మొదలైనవి IVC వారి కార్య కలాపాలు. గతమూడు సంవత్సరాలుగా ఇక్కడ ఒక్క మలేరియా రోగికూడా కనిపించలేదు.

—'సిఇఇ-ఎన్ఎఫ్ఎస్' సౌజన్యంతో

* * *

## సైన్స్ కల్చర్ నగరం

ఉత్తరప్రదేశ్ ముఖ్య పట్టణమైన లక్నో 'సైన్స్ కల్చర్' (వైజ్ఞానిక సంస్కృతి) సమరస భావంతో రూపొందింది. సుమారు 10 జాతీయ సంస్థలు, ఒక యూనివర్సిటీ, ఒక వైద్యకళాశాల, అనేక హాస్పిటళ్లు లక్నో చుట్టు పట్ల నెలకొల్పబడ్డాయి.

* * *

## జార్జియాలో మిక్కిలి వృద్ధుడు

కాకాసస్ జార్జియాలో గొరెకెటి గ్రామంలో నివసించే మెవ్‌లుడ్ డవిటాడ్జె అనే వృద్ధుడికి 131 సంవత్సరాల వయస్సు. ఇతడికి 167 మంది మనుమలు, ముని మనుమలు, ముని మనుమల మనుమలు ఉన్నారు. ఇప్పటికీ ఇతడు ధృఢంగా, ఆరోగ్యంగా ఉన్నాడు. ఇతడు ఎప్పుడూ ఏవైద్యునీ సందర్శించ లేదు. ఏమందు మాకు పుచ్చుకోలేదు. జార్జియా లోని 2000 మంది శతాధిక వృద్ధులలో ఇతడు ఒకడు.

* * *

## మిక్కిలి వేగవంతమైన ఎలివేటర్

నిమిషానికి 540 మీటర్ల వేగంతో పైకి, క్రిందికి పోయే మిక్కిలి వేగవంతమైన ఎలివేటర్ టోకియోలో ఆకాశాన్ని అంటే భవనంలో ఉపయోగించబడుతూంది. ఎలివేటర్ క్రింది అంతస్థు నుండి 20 సెకండ్లకంటే తక్కువ కాలంలో భవనం 55వ అంతస్థుకి చేరుతుంది. ఎలివేటర్ పైకి పోతున్నది, క్రిందికి దిగుతున్నది కూడా తెలియనంత మృదువుగా పని చేస్తుంది. గాలి సొరంగాలలో (wind tunnels) ఎలివేటర్ కారు ఆకారాలను పరీక్షించిన తరువాత ఒక జపాన్ కంపెనీ అతి తక్కువ శబ్దంతో ప్రయాణీకులకు ఎటువంటి ఇబ్బందులూ లేకుండా మిక్కిలి వేగంగా పనిచేసే ఎలివేటర్‌ను రూపొందించింది.

* * *

"ఎవరు తమకు తాము ఉపకారం చేసుకుంటారో వారికి భగవంతుడు ఉపకారం చేస్తాడు."

## భారతదేశంలో 85 శాతం టెలిఫోనులు నగరాలలో కేంద్రీకృతమై ఉన్నాయి

భారతదేశంలో మొత్తం 3.7 మిలియను టెలిఫోనులలో 85 శాతం నగరాలలో కేంద్రీ-



కృతమై ఉన్నాయి. దగ్గర దగ్గర 10 శాతం టెలికమ్యూనికేషను సౌకర్యాలు ఒక్క బొంబాయిలో కేంద్రీకృతమై ఉన్నాయి. బొంబాయిలో 22 మందికి ఒక టెలిఫోను ఉంది.

* * *

## హెచ్‌బిజె గాస్ పైప్‌లైన్ గాస్‌ప్రవాహ సామర్థ్యం

హజిరా-బిజపూర్-జగదీష్పూర్ (HBJ) గాస్ పైప్‌లైన్ బాబ్‌రాలా (Babrala) నుండి న్యూఢిల్లీ నగరానికి చేరుకుంది. HBJ పైప్‌లైన్ 30 కాలువలు, 39 రోడ్లు, అయిదు రైలు క్రాసింగులు, నాలుగు నదులు దాటివస్తుంది. రోజుకి దీనిగుండా మొత్తం 18.2 మిలియను ఘనమీటర్ల గాను ప్రవహిస్తుంది.

* * *

## ముఖానికి కలిగిన హానికి 55,000 డాలర్ల నష్టపరిహారం!

సిడ్నీ (ఆస్ట్రేలియా)లో 26 సం.రాల వయస్సు గల డేవిడ్ ఆలెన్ ప్రిన్స్ ఫాస్టర్ 1970 లో ఒక ప్రమాదంలో చిక్కుకున్నాడు. ప్రమాదం వల్ల ముఖంలో నరాలు నీరసపడిపోయాయని కోర్టులో కేసు పెట్టాడు. కోర్టువారు 55,000 డాలర్ల నష్టపరిహారం చెల్లించవలసినదిగా తీర్పు చెప్పారు.

* * *

## బ్రహ్మాండమైన ముత్యం

దక్షిణ ఫిలిప్పైన్స్ సముద్రంలో దొరికిన బ్రహ్మాండమైన ముత్యం 3 1/2 అంగుళం పొడవు, 2 1/2 అంగుళం వెడల్పు పరిమాణంలో ఉంది. దీనివెల 25,000 డాలర్లు.

(53వ పేజీ తరువాయి)

ప్రతి పరాజయం విజయానికి ఒక మెట్టుగా పరిగణించి లేచి నిబ్బరంగా నిలబడగల ప్రతీ వ్యక్తిని వరించడానికి విజయలక్ష్మి వేచి ఉంటుంది.

* ఒక విజయం సాధించాలంటే ఫలసాయం, పారితోషికం కనిపించక పోయినా పైపైకి ఎక్కుతూండాలి. థామస్ ఎడిసన్ సంతృప్తికరంగా స్టోరేజి బాటరీని అభివృద్ధి చేసేముందు 50,000 సార్లు పరాజయాలు పొందాడు!

* శరీర ఆరోగ్యాన్ని కాపాడుకో. నాయకుడుగా నాయకత్వం వహించాలంటే శరీరారోగ్యం ముఖ్యం.

* నాలుగు ప్రక్కలా చూడు. శ్రద్ధతో అవలోకించు, విశ్లేషించు, వెంటనే ఆచరించు!

-ఇండియన్ జేసీస్ 'చాలెంజ్' సౌజన్యంతో

"ధర్మబద్ధంగా ఉండడం కంటే విమర్శించడం సులభం."

—బెంజమిన్ డిజ్రేలీ

# చెదపురుగులు

టెర్మైట్స్ అని చెప్పబడే చెదపురుగులు సామాన్యంగా అన్ని ఉష్ణ వాతావరణ ప్రదేశాల లోను, సమశీతోష్ణ ప్రదేశాలలోను ప్రవృద్ధి చెందుతున్నాయి. వీటిలో సుమారు 2,000 జాతులు ఉన్నాయి. ఇవి కఱ్ఱను మరియు





TERMITE MOUND QUEEN KING

చెట్లయొక్క కఱ్ఱ సంబంధమైన కణజాలాన్ని తింటాయి. అందుచేతనే ఇవి భవనాలకు, కఱ్ఱ సామానులకు, బట్టలకు మరియు పంటలకు అపారనష్టం కలిగిస్తాయి.

టెర్మైటులు భూమిలో చిన్నచిన్న పుట్టలు పెడతాయి. ఇవి వ్యవసాయ కార్యక్రమాలక్కు, సివిల్ ఇంజనీరింగ్ కార్యక్రమాలకు అంత రాయాలు కలిగిస్తాయి. ఈ పుట్టలు పడగొట్టి ఆమట్టిని కొలిమిలు, ఇటుకలు, కుండలు చేయడానికి, గోడలు పూతలకు, రోడ్ల పైతలానికి, టెన్నిస్‌కోర్టులు చదునుచేయడానికి ఉపయో గిస్తారు.

టెర్మైటులు జంతుసంబంధమైన ప్రోటీనులుగా ఉపయోగపడతాయి. అందుచేత వీటిని కొన్ని దేశాలలో ఆహారంగా తింటారు.

ఇది భూమి లోపల సామాన్యంగా గదులు గదులుగా నిర్మించుకుంటాయి. భూమి పైతలం మీద వీటిని ఎంతమాత్రం కనిపించనీయవు. కొన్ని చిన్నచిన్న పుట్టలను కూడా నిర్మించు కుంటాయి. మట్టిలో ఉండే ఇసుక కణాలతో బంక మట్టిని చేర్చి నోటినుంచి వచ్చే లాలా జలంతో సిమెంటులా తయారు చేసి వాటితో పుట్టలను నిర్మించుకుంటాయి. వాతావరణానికి అనుకూలంగా వీటిని ఎప్పటికప్పుడు మారుస్తూ పెద్దవిగానూ, చిన్నవిగానూ నిర్మించుకుంటాయి.

చెదపుట్టలోపల లెక్కలేనన్ని గదులు, పార్టి షనులు ఏర్పరచి వాటికి అవసరమైన వెలుగు మరియు ఇతర సౌకర్యాలను కలిగించు కుంటాయి.

కొన్ని పెద్ద పెద్ద చెదలపుట్టలు ఖనిజ పరిశోధన కార్యక్రమాలకు సహాయపడతాయి.

## హిమాలయాలగుండా ప్రయాణించిన మొట్టమొదటి మోటారు సైకిల్ యోధుడు

[illegible]

"తన్నుతాను విమర్శించుకునేవాడు సర్వోత్తముడు."

# జ్యేష్టేశ్వరాలయము

రాఘవేంద్రరావు

కాశ్మీర్ శ్రీనగర్‌లో ఒక ప్రక్క డాల్ సరస్సు, మరోప్రక్క ఆకాశాన్ని అంటుతున్న బ్రహ్మాండమైన 1000 అడుగుల ఎత్తుగా ఉండే శంకరాచార్య పర్వతం. ఈ పర్వతానికి భారత దేశపు అద్వైత సాంప్రదాయాన్ని ప్రతిపాదించిన ఆదిశంకరాచార్యుల వారి పేరు పెట్టబడింది.



ఈ కొండపైగల రాతిదేవాలయము జ్యేష్టేశ్వరాలయము. ఇది ఒక గొప్ప శివాలయము. దీనిని 4500 సంవత్సరాలకు పూర్వం రాజా శాండిమన్ నిర్మించాడని కొందరు అంటారు. బైబిల్‌లో ఉదహరించబడిన సోలోమన్ రాజు హజారత్ సులైమాన్ దీనిని నిర్మించాడని మహమ్మదీయుల వింతవాదము. వారు దీనిని సోలోమన్ సింహాసనం (టఖట్-ఇ-సులైమాన్) అని అంటారు.

AD 12వ శతాబ్దంలో రాజతరంగణి (కాశ్మీర్ వంశావళి) రచించిన కల్హణుని ప్రకారం దీనిని గోపాదరికొండ అంటారని, ఇప్పటి దేవాలయం BC 1368లో కాశ్మీర్‌ను పాలించే గోపాదిత్యుడు నిర్మించాడని తెలుస్తూంది. అలెగ్జాండర్

## పూజారి మరియు అస్పృశ్యుడు

*ఒకప్పుడు ఒక అంటరాని అస్పృశ్యుడు ఒక దేవాలయంలోకి ప్రవేశించకోరాడు. పూజారి అనుమతించలేదు. అతిదీనాతిదీనంగా ఆ అస్పృశ్యుడు వేడుకుంటుంటే 'నీవు జన్మతః అపవిత్రుడవు. నీవు మొట్టమొదట రెండు సంవత్సరాలపాటు తపస్సుచేసుకుని ఆ తరువాత నాదగ్గరకు రా' అని అన్నాడు పురోహితుడు. దానికి మాట్లాడకుండా విచారంతో అస్పృశ్యుడు వెళ్లిపోయాడు.*

*సుమారు మూడుసంవత్సరాల తరువాత అకస్మాత్తుగా పురోహితుడు ఒకనాడు రోడ్డుమీద గుడిప్రక్కనుంచి వెళుతూ ఆ అస్పృశ్యుని కలుసుకోవడం తటస్థించింది.*

*అతనిని నిలబెట్టి 'నీవు దేవాలయానికి ఎందుకు రాలేదు? నీవు ఇంకా తపస్సు పూర్తి చేయలేదా? రెండుసంవత్సరాలు దాటి పోయింది' అన్నాడు పూజారి. దానికి ఆ అస్పృశ్యుడు 'స్వామీ! మీరు చెప్పిన పనిచేసాను. మీ అమూల్యమైన ఉపదేశానికి నా ధన్యవాదాలు. దేవుడు నాకు ప్రత్యక్షమైనాడు. తానే గుడిలోనికి వెళ్ళి చాలాకాలమైందని ఆగుడిలోకి వెళ్ల వద్దని నాకు సలహా ఇచ్చాడు' అన్నాడు అస్పృశ్యుడు.*

*పూజారిగర్వం అణిగిపోయింది. భగవంతుడు హృదయం పరీక్షిస్తాడు. పరమాత్ముని దృష్టికి వేషభావలు ప్రాముఖ్యంకాదు.*

*—'ఈస్టవెస్ట్' సౌజన్యంతో*

"జీవితం ప్రథమాధ్యాయం గ్రంథం అయితే చరమాధ్యాయం దాని వ్యాఖ్యానం."

—ఆర్థర్ స్కోపెన్ హెూవర్

కన్నింగ్ హామ్ వంటి అధునాతన చారిత్రక పరిశోధకులు అశోక చక్రవర్తి కుమారుడు జాలూకా (200 BC లో) దీనిని నిర్మించాడని అంటారు.

ఏది ఎట్లున్నా ఒక వాస్తవ విషయం నేటి దేవాలయం పురాతన దేవాలయం నిర్మింపబడిన స్థలంలోనే ఉంది. దగ్గరలో పురాతన దేవాలయ శిధిలాలు ఉన్నాయి. నేడు కనిపించే చుట్టూ ప్రహరీగోడల మధ్యప్రదేశం శిధిలమైపోయిన పాత దేవాలయం ఉన్న ప్రదేశము.

సుమారు 1000 సంవత్సరాలకు పూర్వం ఆదిశంకరాచార్యులు ఈ కొండపైకి ఎక్కి ఇచ్చటి దేవాలయంలో ప్రార్ధనలు సలిపారు. ఇక్కడ ఆదిశంకరాచార్యులకు ఆనాడు శ్రీనగర్ విశ్వవిద్యాలయం అధికారి అయిన ఆచార్య అభినవ గుప్తునితో మత విషయములను గురించి వాదనజరిగిందని,అనంతరము ఆది శంకరాచార్యుల వారికి భక్తి మార్గం ఉపదేశింప బడిందని విశ్వసిస్తారు. ఆదిశంకరాచార్యుల వారు కొద్ది రోజులపాటు బస చేసిన ఆనాటి నుంచి ఆ కొండకు ఆపేరు పెట్టబడింది. ఈ కొండపైన గల శివాలయం దేశంలో వివిధ మూలల నుండి భక్తులను ఆకర్షిస్తూంది.

AD 14వ శతాబ్దంలో మహమ్మదీయులు ఆక్రమించేవరకు కాశ్మీరులో హిందూ మతమే ప్రబలి ఉండేది. కాశ్మీర్‌లో శివ అనే భావము ఇండస్ లోయ నాగరికత నుంచి వచ్చింది. రుద్రశివ అనే భావన వేదకాలపు ఆర్యులనుంచి సంక్రమించినది. కాశ్మీరులో శైవ సాంప్రదాయం ప్రవృద్ధికి ఇదే ముఖ్య కారణము.

కాశ్మీర్‌లో కార్కోట వంశానికి చెందిన లలితా దిత్యుడు కాశ్మీరు దేవాలయాల శిల్పి. ఈ లలితాదిత్యుడే మార్తాండ్‌లో సూర్యదేవాలయాన్ని కూడా నిర్మించాడు. ఇంతేగాక ఇతర అనేక శివాలయాలను కూడా నిర్మించాడు.

## జంతువులకు ఓపెన్ పార్కులు



జంతువులను ప్రేమించే వారిలో ప్రపంచం అంతటా ప్రసిద్ధి చెందిన బ్రిటిష్ వారు జంతువులకు సఫారీ పార్కులను ఏర్పాటు చేసారు. ఈ పార్కులలో జంతువులు తమ సహజ పరిసర ప్రదేశాలలో తిరుగు తున్నట్టు తిరుగుతాయి. సువిశాలమైన భూప్రదేశం అనేక విభాగాలుగా విభజింపబడి ఉంటుంది. పార్కులో ప్రేక్షకులు ప్రతీ విభాగాన్ని చూడడానికి అనుకూలవంతమైన రోడ్డు ఉంటుంది. ప్రేక్షకులు తమ ఇష్టమైన బాటలో తమకార్లను నిలుపుకోవచ్చు, ఫొటోగ్రాఫులు తీయవచ్చు. వివిధ జాతుల జంతువులను పరిశీలించి పరిశోధించవచ్చు. సింహాలు, పులులు, తెల్లరైనోలు, హిప్పోలు, జిరాఫీలు, ఎలాండ్స్, అడవి జంతువులు *(wild beasts)*, చిరుతపులులు, కోతులు, ఏనుగులు మొదలైన అనేక జంతువులు ఉంటాయి. అయితే వీటి సహజ స్వభావం మారదు. కొన్ని చాలా క్రూరంగా ప్రవర్తిస్తాయి. సామాన్యంగా చిన్నపిల్లలకు బహిరంగ పార్కులు మిక్కిలి విద్యాదాయకంగా ఉంటాయి. జంతుజాల పరిశోధనకు సఫారీ పార్కులు మిక్కిలి సహకరిస్తాయి.

"మననం అనే అద్దంలో మంచి చెడ్డలు ప్రతిబింబిస్తాయి."

—హాసన్ అల్ [illegible]

# సాధారణ జలుబు

కొన్ని కొన్ని కుటుంబాలలో వ్యక్తులందరికీ ఇతర కుటుంబాలలో కంటే తరచు జలుబు చేస్తూంటుంది. సాధారణంగా ఇళ్లకి స్కూళ్ల నుంచి "కోల్డ్ బర్గ్స్" (Cold Burgs) తీసుకు వచ్చే పిల్లల నుంచి పెద్దవాళ్లకి జలుబులు పట్టుకుంటాయి. చిన్నపిల్లలు లేని ఇళ్లలో



కంటే ఉన్న ఇళ్లలో పెద్దవాళ్లకి తరచు రెండింతలు అధికంగా జలుబు పట్టుకుంటుంది.

మూడు సంవత్సరాల వయస్సుపైబడి ముఖ్యంగా 20 నుండి 29 సంవత్సరాల వయస్సులోపల ఉన్న ఆడపిల్లలు మగపిల్లల కంటే తరచు జలుబుతో బాధపడుతూంటారు.

సిగరెట్లు కాల్చనీ, కాల్చకపోనీ సిగరెట్లు కాల్చడానికి జలుబుకి ఏవిధమైన సంబంధం లేదు. జలుబు, జ్వరం తీవ్రంగా ఉన్నప్పుడు సాధారణంగా లఘు ఆహారంతోపాటు అధికంగా ద్రవపదార్థం తీసుకోమంటారు. సాధారణ జలుబుకు మందులేదు. పరిశోధనలు జరుగుతున్నాయి. కానీ మందు ఎక్కడా కనిపించడం లేదు.

ఒకసారి జలుబు చేస్తే అదే సూక్ష్మ జీవులతో తిరిగి జలుబు చేయకుండా రక్షణ కలుగుతుంది. కానీ ఇతర జలుబు సూక్ష్మజీవులకు రక్షనివ్వదు. ఒక జలుబు తరువాత ఒక మాసంలో మరో జలుబు పట్టుకోవచ్చు.

జలుబు కలిగించే సూక్ష్మజీవులకు వాతావరణ ప్రభావం లేకపోయినా శీతాకాలంలోను, వసంతకాలంలోను సన్నిహిత సంపర్కంవల్ల జలుబు ఏర్పడుతుంది.

ఎలర్జీలు కూడా ఇవే లక్షణాలు కలిగి ఉంటాయి. సామాన్యంగా సాధారణ జలుబులకు మందులవల్ల కొంతశమనం కలిగినా రెండు మూడు రోజులు ఉంటాయి.

బాగా జలుబుతో ఉన్నవారితో ప్రత్యక్షంగా సంపర్కంవల్ల జలుబు శీఘ్రంగా పట్టుకుంటుంది. జలుబు సూక్ష్మజీవులు దగ్గువల్ల, తుమ్ము వల్ల, షేక్‌హాండ్ చేయడంవల్ల ఒకరి నుంచి ఇంకొకరికి సంక్రమిస్తాయి.

— 'ఇవాన్స్‌విల్లీ కొరియర్' సౌజన్యంతో

## మొట్టమొదటి జాతీయ సంగీత కార్యక్రమము

[illegible]

"ఇంద్రియాలను నియంత్రించుకుంటే బుద్ధి వికసిస్తుంది."

-మహాభారతం

# ఒంటె అవయవ నిర్మాణము

ఒంటెకు చెవుల పిల్లి పెదవులు, దుంచు పళ్లు మరియు జఠరకోశము, ఏనుగు కాళ్లు, పక్షుల రక్తము, సరీసృపములు ఉష్ణోగ్రత ఉంటాయి. దీనికి హంసమెడ ఉంటుంది. పిత్తాశయం ఉండదు.



ఒంటె కళ్లు మూసుకుని చూడగలదు. ఇసుక దూరకుండా ముక్కు రంధ్రాలు మూసుకో గలదు. ఇది జఠరకోశంలోను, వీపు పైమూ పు లోను నీటిని నిలవ చేసి ఉంచుకుంటుంది. స్వచ్ఛమైన నీరు కల్లు త్రాగినట్టు దీనికి మత్తు కలిగిస్తుంది. దీనినే 'బ్లైండ్ స్టాగర్స్' (Blind Staggers) అంటారు. ఇది ఉప్పుకోసం ఉప్పు నీటిని బాగా త్రాగుతుంది. అతి మృదువైన దీర్ఘమైన కనురెప్పలు కళ్లకు సూర్యుని వెలుగు నుంచి రక్షణను కలిగిస్తాయి.

ఆంగ్లభాష అక్షరగుచ్ఛంలో 'C' మరియు 'G' అనే అక్షరాలు ఒంటె మూపురం ఆకారాన్ని బట్టే ప్రవృద్ధి చెందాయి. ఒక బెడాయిన్ అనామకుడు ఏనాడో ప్రాచీనకాలంలో ఒంటె మీద ప్రయాణం చేస్తూ దారిలో త్రాగడానికి తోలుసంచీలో పాలు తీసుకువెళ్లాడు. ఒంటె ప్రత్యేకమైన నడకకు ఆ పాలు చిలుకబడి వెన్న పైకి తేలింది. ఆహారానికి మరో క్రొత్త పదార్థం మానవ లోకానికి ఏర్పడింది.

●

## భారతదేశంలో థోరియం వనరులు

భారతదేశంలో అంచనా వేయబడిన థోరియంను బ్రీడర్ రియాక్టర్లలో ఉపయోగించి ఏటా 500,000MWE విద్యుచ్ఛక్తిని 500 సంవత్సరాలకు జనింపజేసుకోవచ్చు. భారతదేశంలో అంచనా వేయబడిన థోరియం వనరులు సుమారు 3,60,000 టన్నులు. దీంట్లో చాలావరకు కేరళతీరంలో మోనజైట్ ఇసుకలో లభిస్తుంది.

## యుద్ధ సామగ్రికి ప్రపంచం ఒక ట్రిలియన్ డాలర్లు వెచ్చిస్తోంది

మొత్తంమీద ప్రపంచయుద్ధ సామగ్రికి, ఇతర సన్నాహాలకు ఏటా ఒక ట్రిలియను డాలర్లు (ఒకటి తరువాత 18 సున్నాలు) వెచ్చిస్తోంటే 800,000,000 మంది కటిక దారిద్ర్యంలో ఉన్నారు. 770,000,000 మందికి తగిన శక్తి సామర్థ్యాలతో పనిచేయడానికి కావలసినంత ఆహారం లభించడం లేదు. 100,000,000 మందికి నివసించడానికి ఇళ్లులేవు. 1,300,000,000మందికి త్రాగడానికి మంచినీటి సౌకర్యం లేదు. 14,000,000 మంది చిన్న పిల్లలు ఏటా ఆకలిబాధతో మరణిస్తున్నారు.

—'వేక్ అప్ ఇండియా' సౌజన్యంతో

"జన్మదుఃఖానికి కారణం అంటారు వేదాంతులు, కర్మలను ఆచరించడం వల్ల మోక్షం సిద్ధిస్తుందంటారు పూర్వమీమాంసకులు."

# స్వామి తపోవనం

చిన్మయ

కేరళ పాల్ఘాట్ తాలూకాలో కుళల్ మన్నమ్ (Kuzhalmannam) ఒక ఊరు. ఇది చిన్న కుగ్రామం కాదు. పెద్ద పట్టణం కాదు. ఈ ఊరిలో పుదన్‌వీడు అనేఇంట్లో 1889లోఒక బాలుడు జన్మించాడు. తల్లి శ్రీమతి బాలాంబ, తండ్రి శ్రీ అచ్యుతన్ నాయర్. బాలుడికి



SWAMI TAPOVANAM

సుబ్రహ్మణ్యన్ అని పేరు పెట్టారు. తలిదండ్రులు సుబ్రహ్మణ్యన్‌ని ముద్దుగా చిప్పుకుట్టి అని పిలుస్తూండేవారు.

అక్కడ పాఠశాలలో విద్యావిధానం, బోధించే వివిధ విషయాలు అతడి అభిరుచికి తగినట్టుగా లేవు. కాబట్టి చిన్నప్పుడే 14 సంవత్సరాల వయస్సులో పాఠశాలకు వెళ్లడం మానేసి కొడునాయూర్‌లో తండ్రి ఇంట్లో ఉంటూండేవారు. తండ్రికి ఇది ఒక ఆశాభంగం. మంచి ధనవంతుడు, భూవసతి బాగా ఉన్నవాడు కాబట్టి కొడుకుని బాగా చదివించి ప్రభుత్వోద్యోగంలో చేర్పించాలని అనుకున్నాడు.

చిప్పుకుట్టి తనకు కావలసిన విద్యావిధానాన్ని తానే నిర్ణయించుకున్నారు. దగ్గరలో బాగా చదువుకున్న గొప్పగొప్ప విద్వాంసుల వద్ద, పండితుల దగ్గర చేరి అభ్యసించడం ప్రారంభించారు. ఇంగ్లీషు భాషలో సామాన్య ప్రావీణ్యం గణించారు. దేవభాష సంస్కృతం నేర్చుకున్నారు నాటకం, వ్యాకరణం, తర్కం, చందస్సు మొదలైనవన్నీ ప్రాచీన సాంప్రదాయం ప్రకారం నేర్చుకున్నారు. 18 సంవత్సరాల వయస్సులో స్వభాష మలయాళంలో 'విభాకర్' అనే పద్యం రచించారు. అనేకమంది సుప్రసిద్ధ పండితులు చూసి ఎంతో ఆశ్చర్యపడి మెచ్చుకున్నారు.

అప్పటికే వేదం, తత్త్వశాస్త్రం చదువుకోవాలని చిప్పుకుట్టికి ఉత్సాహం బయలుదేరింది. ఎప్పుడూ ఏకాంతంగా పుస్తకాలు చదువుకుంటూండేవారు. తండ్రి ఇంటికి దగ్గరగా ఉన్న చిన్నచిన్న అడవులలోకి వెళ్లి కాలం గడుపుతూండేవారు.

వీరికి 21వ సంవత్సరం వచ్చేటప్పటికి తండ్రి మరణించాడు. తండ్రి మరణంతో ఎన్నోకష్టాలు ఏర్పడ్డాయి. కొంతకాలం పాటు

[redacted]

"ఏకర్మలకైనా కారణం కోరికలే. కాబట్టి పాపం పోగొట్టుకోవాలనేది కూడా కోరికే."

పాల్ఘాట్‌లో 'గోపాలకృష్ణ' అనే మాసపత్రికకు సంపాదకులుగా ఉన్నారు. నిత్య జీవితంలో ధర్మము, న్యాయం, నీతి, విద్య, వాఙ్మయం మొదలైన విషయాలను, సాంఘిక విషయాలను గురించి పత్రికలో వ్రాస్తూండేవారు. రాజకీయ విషయాలను ప్రచురించే వారు కాదు. ముఖ్యంగా కేరళ దక్షిణ జిల్లాలలో ఉపన్యాసాలు ఇస్తూండేవారు. చిట్టచివరకు ఆధ్యాత్మిక వికాసం పొంది విజయం పొందగలిగారు.



చిప్పుకుట్టికి 28 సంవత్సరాల వయస్సు వచ్చేటప్పటికి దక్షిణదేశంలో అనేక పుణ్యస్థలాలను సందర్శించారు. స్వంతంగా సకలశాస్త్రాలు అధ్యయనంచేసి సందేహాలన్నిటినీ నివృత్తి జేసుకోగలిగారు.

ఇంతలో చిప్పుకుట్టి కలకత్తాచేరి అక్కడ ద్వారకా శారదా పీఠాధిపతి అయిన శ్రీస్వామి శాంత్యానందతో కొంతకాలంపాటు నివసించారు. సామాన్యంగా చిప్పుకుట్టి ఎల్లప్పుడు ఏకాంతంగా పార్కులలో ఆధ్యాత్మిక చింతనతో ఆత్మావలోకనం చేసుకుంటూండేవారు. కలకత్తా నుంచి వీరు కాశీ, హరిద్వార్, ఋషీకేశ్ మొదలైన పుణ్యస్థలాలను సందర్శించి పలువురు పండితులను,సన్యాసులను కలుసుకున్నారు. ఉత్తరాది యాత్రలలో చిప్పుకుట్టి పూర్తిగా మార్పుచెందారు. ఒక సన్యాసిగా కేరళ చేరుకున్నారు. తన స్వంతగ్రామంలో మూడు సంవత్సరాల పాటు కాలం గడిపారు. ఇప్పటికీ అక్కడ ఉండేవారు కుళల్‌మన్నంలో వారి తీవ్ర తపోనిష్ఠను గురించి ఆశ్చర్యంగా చెబుతూంటారు.

కృష్ణాష్టమిరోజున ఈ 33 సంవత్సరాల దివ్య యాత్రికుడు కృతనిశ్చయంతో తుంగభద్రా తీరమున ఉన్న హరిహర దేవాలయాన్ని సందర్శించారు. యోగిగా జన్మించిన వీరు అక్కడ ఆత్మసన్యాసాన్ని స్వీకరించారు. ఆ తరువాత ఏడు సంవత్సరాలపాటు భారతదేశంలో అనేక చోట్ల దీర్ఘతపస్సుతో కాలం గడిపేవారు. కైలాస

## ఇండోనేషియాలో విస్తారమైన మాన్‌గ్రోవ్ అడవులు అదృశ్యమై పోతున్నాయి

*ఇండోనేషియాలో విస్తారమైన మాన్‌గ్రోవ్ అడవులు అతిశీఘ్రంగా అదృశ్యమైపోతున్నాయి. మొట్టమొదట ఉన్న 4.6 మిలియను హెక్టేరులలో 3.2 మిలియను హెక్టేరుల అడవులు మాత్రమే మిగిలిఉన్నాయి. ఇందులో ఎక్కువ ప్రదేశం జపానుకు కలప ఎగుమతికి ప్రత్యేకించబడింది. మాన్‌గ్రోవ్ అడవులు పూర్తిగా పెరగడానికి 30 సంవత్సరాలు పడుతుంది. తమ కాంట్రాక్టు వ్యాపారాలకు భంగంకలుగుతుందేమో అనే భయంచేత కలప వర్తకులకు వీటి పునరాభివృద్ధి చింతలేదు. వ్యవసాయ కార్యక్రమాలు, మత్స్య పరిశ్రమ మరియు ఇతర పారిశ్రామికాభి వృద్ధులవల్ల ఈ అడవులు నశించిపోతున్నాయి. పుష్కలమైన ఆహార వస్తువులకు, వంటచెరుకుకి మరియు పశువులమేతకు మాన్‌గ్రోవ్ అడవులు ముఖ్యాధారం. స్థానికవాసులకు ఔషధమూలికలు, మహానద్రవ్యాలు, తేనె, పిల్లల ఆటవస్తువులు మరియు ఇతర సామానులు చెక్కడానికి కర్ర మొదలైనవి ఈ మాన్‌గ్రోవ్ అడవులలో లభిస్తున్నాయి.*

"మానవ జీవితాన్ని ఉత్తేజవంతం చేసుకోడానికి ప్రేమను మించిన మహోన్నత శక్తి లేదు."

క్షేత్రానికి యాత్ర, హిమాలయసంచారం, బదరీ, ఉత్తరకాశీలలో నివాసము మొదలైనవన్నీ వీరి ఆధ్యాత్మిక జీవనంలో ఒకదివ్యచరిత్ర.

ఈ యాత్రలను ముగించుకుని ఋషీకేశ్ చేరారు. గంగానదిలో 'పురాణాజడి' అనే ద్వీపంలో ఒకపాక నిర్మించుకుని ధ్యానం చేసుకునేవారు. ఆసమయంలోనే ఋషీకేశ్ కైలాసాశ్రమాధిపతి అయిన శ్రీస్వామి జనార్దనగిరి వీరికి సక్రమదీక్షను ఇచ్చారు. ఈ విధంగా చిప్పుకుట్టి తపోవనస్వామిగా ప్రసిద్ధి పొందారు. కాశ్మీరు నుండి కాలినడకను బయలుదేరి హిమాలయాలలో అమర్‌నాథ్, ఆల్మోరా, కైలాస్‌లో గల హిమాలయ పర్వత శిఖరాలను సందర్శించారు. ముఖ్యంగా ఉత్తర కాశీ లేక గంగోత్రిలో నివసిస్తూ వేసవికాలం ఈ ప్రయాణాలు చేస్తూండేవారు.

వీరిని దర్శించి కోరిన వారందరికీ ప్రస్థానత్రయం బోధిస్తూండేవారు. అభ్యాస నిగ్రహంతో క్రమశిక్షణను పాటించేవారు కాబట్టి శిష్యులు చాలాకాలం ఇతని దగ్గర చదువుకోడానికి ఉండేవారు కాదు.

1955వ సంవత్సరంలో స్వామీజీకి ఆరోగ్యం చెడిపోయింది. 1956 డిసెంబరులో, నాకు ఎంతో విచారం కలిగింది. మాట లేక కళ్లలో నీళ్లు తిరిగిపోతున్నాయి. స్వామీజీ మెల్లగా హీన స్వరంతో 'చిన్మయా! వేదాంతం చదువుకోవడం సులభం. వేదాంతం ఉపదేశించడం అంతకంటే సులభం. అనుసరించడం మాత్రం కష్టం. మనతోపాటే మరణం కూడా జన్మిస్తుంది. విచారించకు, నీవు వెళ్లి నీ ధర్మం నీవు ఆచరించు. మానకు' అని చెప్పారు.

నేను పాల్ఘాట్‌లో పాఠం చెబుతూండగా వార్తవచ్చింది. దివ్యజ్యోతి ఆరిపోయింది. సర్వోత్కృష్టమైన అనంతంలో లీనమైపోయింది. 1957 జనవరిలో పౌర్ణమినాడు భౌతికకాయాన్ని చాలించారు.

—'హిమ్ టు బదరీనాథ్' సౌజన్యంతో

•

**దీర్ఘకాలం జీవించిన మనిషి**

[illegible] 207 సంవత్సరాలు. [illegible] మరణించాడు.

## కాలప్రభావం

*అనేకరంగాలలో వివిధ కార్యక్రమాలు కాలానికి అనుగుణ్యంగా ఉంటాయి. పామరులు కాలాన్ని వృథా చేస్తారు. చారిత్రక పరిశోధకులు కాలాన్ని నిర్ణయిస్తారు. ఏదిఏలా ఉన్నా మన అందరికీ సమానమైన కాలం రోజుకి 24 గంటలు, వారానికి 168 గంటలు. దీనిని సద్వినియోగం చేసుకోవాలి, వృథాచేయ కూడదు.*

—డెన్నిస్ హెచ్చ్లే

"సేవాధర్మాన్ని వ్యతిరేకించే వేదాంతి శుష్క వేదాంతి."